S.V.University Oriental Series No:27
సాధారణ సంపాదకుడు :
డైరెక్టర్, యస్.వి.యు.ఓ.ఆర్.ఇన్ స్టిట్యూట్.

గుఱ్ఱము చినకపోతయ్య విరచిత

# [illegible] చరిత్ర

(యక్షగానము)

పరిష్కర్త
డా.ఎలవర్తి చంద్రమౌళి, ఎం.ఎ., ఎం.ఫిల్.,పిహెచ్.డి.,
సహాయాంధ్ర పరిశోధకుడు
యస్.వి.యు.ఓ.ఆర్.ఇన్ స్టిట్యూట్



శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ
ప్రాచ్య పరిశోధనాలయం
తిరుపతి
2002

S.V.University Oriental Series No:27
సాధారణ సంపాదకుడు :
డైరెక్టర్, యస్.వి.యు.ఓ.ఆర్.ఇన్ స్టిట్యూట్.

గుఱ్ఱము చినకపోతయ్య విరచిత

# వీరచోడవ్వ చరిత్ర

(యక్షగానము)

పరిష్కర్త
డా.ఎలవర్తి చంద్రమౌళి, ఎం.ఏ., ఎం.ఫిల్.,పిహెచ్.డి.,
సహాయాంధ్ర పరిశోధకుడు
యస్.వి.యు.ఓ.ఆర్.ఇన్ స్టిట్యూట్



శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ
ప్రాచ్య పరిశోధనాలయం
తిరుపతి
2002

డా.వి.వేంకటరమణారెడ్డి
ఇన్ చార్జ్ డైరక్టర్
శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ
ప్రాచ్య పరిశోధనా సంస్థ
తిరుపతి.

## ముందుమాట

ఆంధ్రదేశంలో వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనా సంస్థకు ఒక ప్రత్యేక స్థానం ఉంది. ఈ సంస్థలో గతంలో పనిచేసిన కవి పండితుల ద్వారా సంస్థకు ఒక ప్రత్యేక గుర్తింపు లభించింది. గతంలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ లాంటి ఉద్దండ పండితులు ఇచట సాహిత్య పరిశోధన నిర్వహించడం మాకుగర్వకారణం. మొట్టమొదటి సారిగా అముద్రిత అన్నమయ్య కీర్తనలను ముద్రించిన ఘనకీర్తి కూడా ఈసంస్థదే. వారి అడుగుజాడలలో నడుస్తూ సంస్థయొక్క గౌరవాన్ని ఇనుమడింపచేస్తూ తాళపత్రప్రతుల పరిష్కరణ, ప్రచురణ బాధ్యతలను మాసంస్థ పరిశోధకబృందం కొనసాగిస్తోంది. ఇందులో భాగమే ఈ యక్షగాన కుసుమం. ఆంధ్ర సాహిత్య ప్రక్రియలో యక్షగానానికి ఒక ప్రత్యేక స్థానం ఉంది. ఇది ఒక విశిష్టమైన ప్రక్రియ. సంగీత సాహిత్యాల సమ్మేళనం ఈ ప్రక్రియ.

యక్షగానాల్లో అధికభాగం అముద్రితంగానే వున్నాయి. అవి మా సంస్థలో కూడా చెప్పుకోదగ్గ సంఖ్యలో వున్నాయి. మా పరిశోధనా సంస్థలో డా.కె.జె.కృష్ణమూర్తిగారు తరిగొండ వేంగమాంబ రచించిన 'జలక్రీడా విలాసం' (1985), కె.ఆనందన్ గారు బలభద్రదాసి రచించిన 'కపోతవాక్యం' (1986), డా.యం.ప్రభాకర రావు గారు బాలపాపాంబ రచించిన 'అక్కమహాదేవి చరిత్ర' (1988) , పరిష్కరించారు. గుజ్జము చినకపోతయ్య రచించిన 'వీరచోడవ్వ చరిత్ర' ఈవరుసలో నాలుగవది.

ఈ యక్షగానం అముద్రిత తాళపత్రప్రతి ఆధారంగా పరిష్కరింపబడింది. పరిష్కర్త డా.ఎలవర్తి చంద్రమౌళిగారు చక్కని పీఠికను రూపొందించారు. ఈ పీఠిక ద్వారా పరిష్కర్త సునిశిత పరిశీలనాశక్తి, తాళపత్ర ప్రతుల పరిష్కరణపట్ల గల ఆసక్తి స్పష్టమౌతోంది

ఇంకా ఈ సంస్థలో అపరిష్కృతంగా ఉన్న అనేక అమూల్యమైన యక్షగానాలు ఇదేవరుసలో వెలుగు చూడాలన్నది నాకోరిక.

తిరుపతి వి.వేంకటరమణా రెడ్డి

24.01.2002

# నమస్సులు

గుజ్జము చినకపోతయ్య రచించిన వీరచోడవ్వ చరిత్ర పరిష్కరణ విషయంలో ప్రత్యేకమైన శ్రద్ధతీసుకొని ప్రోత్సహించిన నాటి డైరెక్టరు ఆచార్య శ్రీమన్నారాయణమూర్తి గారు, నేటి మా ఇన్ చార్జ్ డైరెక్టరు ఆచార్య వి.వి.రమణారెడ్డి గారు-

యక్షగానాన్ని పరిష్కరించడంలో, భాషా సాహిత్య విషయాల్లో అడుగడుగునా కొండంత అండగా ఉండి సహకారాన్ని అందించి, ఆశీర్వదించిన గురువర్యులు ఆచార్య కె.జె.కృష్ణమూర్తిగారు-

పరిష్కరణలో సహకరించి తగురీతిలో సూచనలిచ్చి ప్రోత్సహించిన ఆప్తులు ఆచార్య పి.నరసింహారెడ్డి గారు-

అనుమాన నివృత్తిలో మనస్ఫూర్తిగా సహాయ సహకారాలందించిన మిత్రులు డా.యం.ప్రభాకర రావు, డా.టి.యస్.ఆర్. నారాయణన్ గార్లు-

పరిష్కరణ, పరిశోధనలో తమవంతు సహకారాన్ని అందించిన మిత్రులు డా.పి.భాస్కర్ రెడ్డి, డా. యన్. కృష్ణారెడ్డి, డా.టి. సురేంద్ర రెడ్డిగార్లు -

అముద్రిత గ్రంధాన్ని ముద్రించి వెలుగులోకి తేవడానికి అవకాశం కలిగించిన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ అధికార్లు-

ఈపరిష్కరణ ఈవిధంగా రూపుదిద్దుకోవడానికి తమ పూర్తి సహకారాన్ని అందించిన శ్రీ.వి రాఘవేంద్రరావు, యన్. పరమేశ్వరి, కె.గంగాసువర్ణ గార్లు-

పుస్తక రూపం ధరించడానికి తోడ్పడిన మిత్రుడు ఆర్.వెంకటేశ రెడ్డి, సాయిశ్రీ ఆఫ్ సెట్ ప్రింటర్స్ సిబ్బందికి నా కృతజ్ఞతాపూర్వక **నమస్సులు.**

ఎలవర్తి చంద్రమౌళి

# వీరచోడవ్వ చరిత్ర
## (యక్షగానము)
## పీఠిక

ప్రక్రియ:

తెలుగు సాహిత్యంలో 'యక్షగాన' ప్రక్రియ విశిష్టమైంది. సంగీత సాహిత్యాల మేలుకలయిక యక్షగానం. ఈ ప్రక్రియలో దేశీయత పాలు మిగిలిన సాహిత్య ప్రక్రియలకంటే అధికం.

యక్షగానంలో తాళ ప్రధానమైన దరువులు (లేదా) రేకులు, ద్విపదలు, ఏలలు, అర్ధచంద్రికలు, ధవళాలు, శోభనాలు వంటి గీత ప్రబంధాలు; వచనాలు; పద్యాలు ఉంటాయి. ఎన్ని ఉన్నాగాని మాత్రాగణ భరితమైన దేశిరచనలకే ప్రాధాన్యం కనిపిస్తుంది.

తెలుగు సాహిత్యంలో యక్షగాన సంబంధమైన ఆటపాటల ప్రసక్తి మొదటిసారిగా పాల్కురికిసోమనాథుని కృతులలో కానవస్తుంది. యక్షగానా ల్లో ప్రధానాంగాలైన పదాల గురించి చెప్పిందీ సోమనాథుడే. దీన్నిబట్టి పాల్కురికి సోమనాథుని కాలానికి ముందే యక్షగాన ప్రక్రియ ఏదోవిధంగా ఉండేదని ఊహించవచ్చు. కాని సోమనాథునికి దాదాపు రెండువందల సంవత్సరాల తరువాతే తొలితెలుగు యక్షగానానికి సంబంధించిన కొంత సమాచారం లభిస్తోంది. అది ప్రోలుగంటి చెన్నశౌరి రచించిన 'సౌభరిచరిత్ర'. అదీ అలభ్యం. ఈ కవి కాలం 15వశతాబ్దం ఉత్తరార్థం. తరువాతి కాలంలో చక్రపురి రాఘవాచార్యుని (1545) 'విప్రనారాయణచరిత్ర' (D 1939.P.L), కందుకూరి రుద్రకవి (1568) 'సుగ్రీవవిజయము', ఇవి రెండు కాస్త ముందు వెనుకల ఒకేకాలంలో రచింపబడినాయి. ఇందులో సుగ్రీవిజయం ముద్రితం. ఈ విధంగా ప్రారంభమైన యక్షగాన ప్రక్రియ తరువాతి కాలంలో బాగా

విస్తరించింది. వందల సంఖ్యలో యక్షగానాలు రచింపబడినాయి. విశేషంగా పండిత పామర జనరంజకంగా సాగిన ప్రక్రియ యక్షగాన ప్రక్రియ.

యక్షగానప్రక్రియకు సంబంధించిన పరిశోధనలో పాల్కురికి సోమనాథుని స్పృశించడం తప్పనిసరి. వీరశైవాంధ్రవాఙ్మయంలో కూడా యక్షగానప్రక్రియ చెప్పుకోదగిన స్థానాన్ని ఆక్రమించింది. రెగళ్లగె నిమ్మ నాథుని - నిజలింగ చిక్కయ్యకథ, గురునంబిచరిత్ర; హాలెకోటయ్య- చిఱు తొండ భక్తకథా నిధానము; అనుమోదసన్యాసి - బసవకల్యాణము; కానూరి వరవీరభద్రుని బసవమహిమామృత విలాసము; బుక్కము సాంబయ్య- భల్లాణచరిత్ర పేర్కోదగినవి. ఈవరుసలోనిదే గుబ్బము చినకపోతయ్య 'వీరచోడవ్వచరిత్ర'.

కవి:

'వీరచోడవ్వ చరిత్ర' యక్షగాన రచయిత గుబ్బము చినకపోతయ్య. ఇతని తాత ఫాలాంకవిభుడు. అవ్వ పర్వతమ్మ.[1] తండ్రి గుబ్బము గణేశుడు. తల్లి సోమమాంబ. తండ్రి తోబుట్టువులు ఆరుగురు. అందులో ధర్మవర్తనుడు, మానఘనుడు, అన్నదాన చక్రవర్తి అనిపించుకొన్నాడట కవి తండ్రి. కవి అన్న పెదకపోతి. తమ్ముడు రాచయ్య, కవిగురువు రేవణసిద్ధదేవుడు. కవి కులం గురించి స్వయంగా 'శైవకులపవిత్రుడ'నని చెప్పుకున్నాడు. కవి తనను అనఘవర్తనుడని, శివకవీంద్రుడని, రసికశేఖరుడని చెప్పుకున్నాడు. ఇది అక్షరసత్యం. రసికశేఖరుడనడానికి వీరచోడవ్వచరిత్రలో పలుచోట్ల బలంచేకూరుతోంది. ఇతని మరోరచన 'దారుకావన క్రీడ' ఇందుకు ప్రత్యక్ష నిదర్శనం.

---

1. ఈ విషయం ఈకవి మరోరచనయైన దారుకావనక్రీడలో పేర్కొబడింది.

నివాసం:

చినకపోతయ్య వీరచోడవ్వ చరిత్రను రొంపిచర్లలో నెలకొనియున్న శంకరేశ్వరునికి అంకితం చేశాడు. రొంపిచర్ల కడపజిల్లా వాయల్పాడు తాలుకాలో ఉందని ఆచార్య యస్.వి. జోగారావు పేర్కొన్నారు.[1] అప్పటికి (1961) కడపజిల్లాలో ఉండిన రొంపిచర్ల నేడు చిత్తూరు జిల్లాలో ఉంది. రొంపిచర్ల తిరుపతికి 50 కి.మి.దూరంలో ఉంది. ప్రస్తుతం రొంపిచర్ల మండల కేంద్రం. శివాలయం గ్రామానికి బయట చెరువు కట్టకింద్ర నెలకొని ఉంది. ఆలయ పరిసరాలు వృక్షాలు, ప్రాచీనతను చాటుతున్నాయి. ఆలయంలో నిత్యం జరగవలసిన పూజాది కార్యక్రమాలు ఏవీ జరగడం లేదు. శివరాత్రికి మాత్రం విశేషంగా ఉత్సవం జరుగుతుందని గ్రామస్థులు తెలిపారు.

నేడు ఆలయ ప్రభావం ఆప్రాంతంలో పెద్దగా కనిపించడంలేదు. బహుశా కపోతయ్య కాలంలో ఆలయం చిన్నదే అయినా ప్రభావం అధికంగా ఉండి ఉండవచ్చుననిపిస్తుంది.

ఇష్టదేవతాస్తుతిలో గణపతిని ప్రణుతించి, తరువాత ఆయనకు అనుజుడైన రాచవీటి వీరభద్రుని కొనియాడాడు. రొంపిచర్లకి 20 కి.మీ. దూరంలో నాటి రాచవీడు నేటి రాయచోటి ఉంది. రాయచోటిలోని వీరభద్ర స్వామి ఆలయం నేటికి ప్రసిద్ధమే. రొంపిచర్లలోని శివాలయానికి దాదాపు 30 ఎకరాలు మాన్యం భూములున్నాయి. ఆ భూములకు సమీపంలోనే రాయచోటి వీరభద్రస్వామికి కూడా మాన్యం భూములున్నట్లు గ్రామస్థులు పేర్కొన్నారు. అందువల్ల కవి రొంపిచర్ల ప్రాంతానికి చెందినవాడుగానే భావించవచ్చు.

---

1. ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట. 86.

**కాలం:**

చినకపోతయ్య కాలానికి సంబంధించి యక్షగానంలో ఏ ఆధారం లభించలేదు. యక్షగానంచివర "ఈశ్వరనామ సంవత్సర చైత్రశుద్ధ 7 జయవారం వర్కు మాజేటి సర్వేశలింగం వ్రాసుకున్నాడు" అని వీరచోడవ్వ చరిత్రలో పేర్కొబడింది. ఇది 25-3-1817కు సరిపోతుంది. ఏదో ఒకప్రతిని చూచి మాజేటి సర్వేశలింగం వ్రాసుకున్నాడు. ఆచూచివ్రాసిన ప్రతి మూల ప్రతి కావచ్చు వేరేదైనా కావచ్చు. ఏదిఏమైనా కవి అంతకన్నా కనీసం 50 సంవత్సరాలు ముందు ఉన్నట్లు భావించి, ఈ కవికాలం 1750-1800 మధ్యగా ఊహించవచ్చు. అంతకన్నా ఊహించడానికి ఆధారాలు లేవు.

రచనలు:

ఈ కవి రచనలు రెండున్నాయి. ఒకటి దారుకావనక్రీడ, రెండు వీర చోడవ్వ చరిత్ర. రెండు రచనలూ రొంపిచర్ల శంకరేశ్వరునికే అంకితం చేశాడు. రెండూ శైవసంబంధి రచనలే. రెండూ గానయోగ్యాలే. దారుకా వనక్రీడ సువ్వాల అనే గానయోగ్యమైన రచన. దారుకావనక్రీడలోని విషయం వీరచోడవ్వ చరిత్రలో కూడా కథారంభంలో కనిపిస్తుంది. ఆ సందర్భంలోని విషయాన్ని గ్రహించి పెంచి ప్రత్యేకంగా దారుకావనక్రీడగా, సువ్వాలలో రచించాడు .

**కథకు మూలం:** చాతుర్యంబగు నీ కథ
గీతార్థములందు మిగులఁ గీర్తన కెక్కన్
ఆతెఱఁగెల్లను నేను పు
రాతన నివహంబు కరుణ రచియిస్తిఁ జామీ

అని 'వీరచోడవ్వ చరిత్ర' కథకు మూలం 'పురాతన నివహం' యొక్క 'గీతార్థములు'గా కవి పేర్కొన్నాడు.

శిష్టారామకృష్ణశాస్త్రి' ఈకథ బసవపురాణమున నొక యుపాఖ్యానముగా పాల్కురికి సోమనాథుచే రచింపబడెను. దానినే ఈకవి గ్రహించి యక్ష గానముగా రచించెను.[1] అన్నారు. పాల్కురికి సోమనాథుని బసవపురాణం, పండితారాధ్య చరిత్రలలో కొన్ని కథాసందర్భాలలో వీరచోడవ్వ ప్రస్తావన కనిపిస్తుంది.

బసవపురాణంలో సంగమేశ్వరుడు జంగమరూపం ధరించి బసవని మూఁడవ కన్ను అడిగే సందర్భంలో బసవడు 'మిగిలిన భక్తుల్లాగానేనేమీ కోరను' 'నీదు సకల నియోగంబు మావారలైయుండ' నాకేమిటి కొరత? అని అంటాడు. ఆ భక్తుల వరుసలో -

"ఆరగింపఁగఁ బెట్టు నవసరంబులది
వీరచోడవగారు విశ్వైక వినుత!"[2]

బసవపురాణంలోనే బెజ్జమహాదేవి కథలో పరమేశ్వరునికి తల్లి లేదని బాధపడుతూ, తాను తల్లిగా, శివుణ్ణి తన తనయునిగా భావించి తన బాధ్యతలు నిర్వర్తిస్తుంది. తనయుడు పాలు మానేస్తాడు. బెజ్జ మహాదేవి దుఃఖిస్తూ రాచవీటిలో పిట్టవ్వ దగ్గర పిట్టారగించడాన్ని, సామవేదుల ఇంట చచ్చిన పెయ్యను వండి పెట్టగా తినడాన్ని, కరికాళవ్వ ఇంట మామిడి పండ్లు తినడాన్ని, చెన్నయ ఇంట పుల్లని అంబలి తాగడాన్ని, చిరుతొండ నంబి కొడుకు మాంసాన్ని కోరి విందుచేయడాన్ని, నిమ్మవ్వ ఇంట భుజించడాన్ని పేర్కొంటూ -

1. వీరశైవాంధ్ర వాఙ్మయము. పుట. 376.

2. బసవ పురాణము. పుట. 40.

"యారగింపఁగఁ జవిమైనఁ జోడవ్వ
కోరతో నిచ్చినఁ గొని యారగించి"[1]

అంటూ చోడవ్వ సమర్పించిన పులగాన్ని తినినగాథ పేర్కొబడింది.

బసవపురాణంలో సురియచౌడయ్య కథలో చౌడయ్య కడికడిగా పదార్థాలు అందివ్వగా పరమేశ్వరుడు ఆరగించాడు. ఆసందర్భంలో కరికాళ చోడుడు, మాదర చెన్నయ్య - వంటి భక్తులు వడ్డింపగా శివుడు ఆరగించిన రీతిగా, ఇప్పుడు ఆరగిస్తున్నాడని భక్తులు కీర్తించారట. ఆ వరుసలో -

"వీరచోడవ్వ దాక్షారామమందు
నారగింపఁగఁజవిమైనఁగంపించెఁ
గుడుకతోడన మఱి గడియెత్త నోడి
తడయక పులగంబు దాసిచేఁ బనుపఁ
బుత్తెంచె మాయక్క పులగంబు నీకుఁ
జిత్తజాంతక! యిదె చేకొనుమనినఁ
బ్రీతిమైఁ జెయి సాఁచి భీమేశుఁ డతివ
చేతిపులగముఁ జెచ్చెరఁ బుచ్చికొనుచు
నారోగణము సేసి యందఱుఁ జూడఁ
గోరఁ గ్రంగన వైచె గుడివెలి ననఁగ"[2]

అని వీరచోడవ్వకథ సంగ్రహరూపంలో కనిపిస్తుంది.

పండితారాధ్య చరిత్రలో దీక్షాప్రకరణంలో సామవేది కథలో, సామవేది తాను సమకూర్చిన పదార్థాలు ఆరగింపమని వేడుకొనే సందర్భంలో కరి కాళయ్య, చురియచౌడయ్య, కన్నప్ప, పిట్టవ్వ వంటి భక్తులచెంత ఆరగించిన రీతిగా ఆరగింపుమని కోరుతాడు. ఆ భక్తుల వరుసలోనే -

---

1. బసవపురాణము. పుట. 60.
2. బసవ పురాణము. పుట. 144.

"ఆయత వీరచోడవ్వ వడ్డింపఁ
జేయార నారగించిన చందమునను"[1]

అన్నచోట వీరచోడవ్వ ప్రస్తావన కనిపిస్తుంది.

గురుభక్తాండారి కథలో భక్తాండారిని వేశ్య తిరస్కరిస్తుంది. కొంత సంభాషణ జరుగుతుంది. ఇది మొదలుకొని పురుషులను కోరి పిలువనని ప్రమాణం చెయ్యమంటాడు భక్తాండారి. అలా కాకుంటే అక్క మహాదేవి లాగా ఇంద్రియ సుఖాలు వదల మంటాడు. తిలకవ్వలాగా పురుషత్వాన్ని ధరింపమని చెప్తూ ఇన్ని మాటలెందుకు అంటూ -

"తాలిమిగల భక్తురాలవేనియును
వీరచోడని భంగి మారారిఁ గవయఁ
గోరెదేఁ బొదము దక్షారామమునకు"[2]

అని వీరచోడవ్వ పరమేశ్వరుని పొందిన విషయాన్ని పేర్కోవడం జరిగింది.

ఇదే విధంగా ఇంకా కొన్ని సందర్భాల్లో కేవలం చోడవ్వ పేరు మాత్రం ప్రస్తావించడం కూడా కనిపిస్తుంది. పైన పేర్కొన్న సందర్భాల్లో నూ, మరికొన్ని పురాతన గీతార్థాల్లోనూ సంగ్రహంగా ఉన్న కథను శివ కవీంద్రుడైన కపోతయ్య పెంచి యక్షగానంగా రచించాడు.

**కథాసంగ్రహం:**

దారుకావనంలో సనకాదిమునులు ఈశ్వరభక్తిని వదలిపెట్టి, స్త్రీలోలురై విచ్చలవిడిగా ప్రవర్తిస్తున్నారు. పరమేశ్వరుడు దిగంబర స్వరూపంతో అక్కడికి వచ్చాడు. అక్కడి స్త్రీలను మచ్చికచేసుకున్నాడు. అప్పుడు

---

1. పండితారాధ్య చరిత్ర, పుట. 139
2. పండితారాధ్య చరిత్ర, పుట. 332

మునులు కోపించి కొన్నిమాయలు చేశారు. అప్పుడు పరమశివుడు మును లను అంగహీనులుగా శపించాడు. వారి స్త్రీలను భూలోకంలో సాని వంశంలో జన్మించి, తనను సేవించి మోక్షంపొందునట్లు చెప్పి అదృశ్యమయ్యాడు.

దాక్షారామంలోని సానివంశంలో ప్రముఖుడు మల్లినాయకుడు. అతని భార్య నన్నెచోడమ. వీరికి సంతానంలేదు. సంతానంకోరి కేదారవ్రతం తల పెట్టారు.

***

కైలాసగిరిమీద పార్వతీ పరమేశ్వరులు జూదమాడుతుండగా శివుడు నవ్వాడు. 'జూదంలో ఎత్తుతప్పలేదు. ఎందుకు నవ్వుతున్నా?'రని అడిగింది పార్వతి. 'దాక్షారామంలో సానివారు బాలికామణులను నాకిచ్చి పెళ్లిచేసి నన్ను అల్లుడుగా కొలుస్తున్నారు. అందుకు నవ్వువచ్చిం'దని చెప్పాడు పరమేశ్వరుడు.

అప్పుడు పార్వతీదేవి 'మళ్లీపెళ్లికి అవకాశం లభించింది; ఆవంశంలో పుట్టి మీఅభీష్టం మేరకు మెలగాలని నాకోరిక' అని చెప్పింది. తరువాత పార్వతి తన నిజాంశతో నన్నెచోడమకు మల్లినాయకునికి వీరచోడవ్వగా జన్మించింది.

***

వీరచోడమ రతిరూపంతో, భారతి వాగ్విభవంతో, సిరిసౌభాగ్యంతో విలసిల్లుతోంది. ఆడపిల్లను ముందుగా దాక్షారామ భీమేశ్వరుని కిచ్చి పెండ్లి చేయడం వారిఆచారం. వీరచోడవ్వకూ అలాగే చేశారు. మిగిలిన కన్యల లాగా కాకుండా వీరచోడవ్వ భీమలింగాన్ని గాఢంగా ప్రేమించింది. తల్లి దండ్రులు బంధుజనాలు సంతోషించారు. భీమేశ్వరుడు చోడవ్వ ప్రేమను

రూఢిచేయడానికి, ఒకనాటక మాడాడు. విటవేషం ధరించి నన్నెచోడమకు డబ్బు ఆశ చూపాడు. నన్నెచోడమ భీమలింగంమీది ఆశ వదలు కొమ్మంటుంది. ధనవంతుడైన విటుని వివాహం చేసుకొమ్మంటుంది. వీరచోడవ్వ తల్లిని, బంధుజనాలను తిరస్కరించింది.

'భీమనాయకుఁ డింక నామనోనాయకుఁడు
సీమనాయకులనేఁ గామించనేరన్'

అని తన అభిప్రాయాన్ని స్పష్టంచేసింది.

వీరచోడమ సమర్తాడింది. ఆశుభసందర్భాన బంధువులు నానారకాల సుగంధద్రవ్యాలు తెచ్చారు. ఫులకండం, జున్ను, నెయ్యి కలిపిన పులగం తెచ్చారు. ఆపులగాన్ని వీరచోడవ్వ రుచిచూసింది. ఒక గిన్నెలో భీమేశ్వరుని కిమ్మని చెలికత్తెద్వారా పంపింది. భీమలింగం పులగాన్ని తీసుకొని ఆరగించాడు. గిన్నె తిరిగి ఇవ్వకుండా ఆలస్యంచేశాడు. పులగం తెచ్చిన మరదలు భీమ బావను-

'కోరయియ్యఁగదవె భీమబావ! కోరయియ్య గదవె!' అని గిన్నె ఇమ్మని అడిగింది. భీమలింగం సగంపులగం తిని సగం ఉంచుకొని గిన్నె' తిరిగి ఇవ్వ లేకపోయాడు. మరదలు మళ్ళీ అడిగింది. పూజకోసం పూజారులు తెచ్చిన బంగారుగిన్నెను భీమేశ్వరుడు విసరివేశాడు. వెండి గిన్నెకు బదులు బంగారు గిన్నెఇచ్చాడని మరదలు సంబరపడింది. బంగారు గిన్నెను చోడవ్వ కిచ్చింది. భగవంతుని అనుగ్రహాన్ని వివరించింది. బంధు జనులు సంతోషించారు. వీరచోడమను 'వీరశైవాచార విఖ్యాతమతివి' అని కొనియాడారు. కొంతమంది చెలికత్తె బంగారు గిన్నెను దొంగిలించిందః అనుమానించారు.

'ఎక్కడి భీమేశుఁ డెక్కడి పులగ!

మెక్కడి చోడవ్వ యెక్కడి గిన్నె!'

అని తమ అభిప్రాయాలు వెల్లడించి వెళ్ళిపోయారు. పూజచేయడానికి పూజారులు వచ్చారు. బంగారుగిన్నె లేకపోవడాన్ని గమనించారు. 'ఎవరు తీసిఉంటా'రని తమలోతాము చర్చించుకున్నారు. అందులో ఒకడు 'వీర చోడవ్వ చెలికత్తె ఇంతకు మునుపు తలుపు దగ్గరకు వచ్చిం'దని చెప్పాడు. పూజారులు వీరచోడవ్వ దగ్గరకు వచ్చి విచారించారు. అందుకు వీరచోడవ్వ 'సానివంశంలో దొంగతనం లేదు. భీమలింగం వెండిగిన్నె తీసుకున్నా'డని చెప్పింది. అప్పుడు పూజారులు 'నువ్వుచెప్పింది నిజమైతే నిన్ను గంగతో, పార్వతితో సమంగా చూస్తా'మన్నారు. అపుడు చోడవ్వ 'దేవుని సభలోకి రప్పించి గిన్నె ఇప్పిస్తా'నని, 'మీకు వరాలిప్పిస్తా'నని చెప్పింది.

పూజారులు చోడవ్వభక్తిని పరీక్షించడానికి చాటింపువేశారు. భీమేశ్వరుని పూజించి తలుపులు తాళంవేశారు. ముఖమంటపంలో అందరూ చేరారు. అపుడు చోడవ్వ శుచిస్నానం చేసి, భీమేశుని మనస్సులో నిలిపింది. ప్రజలు తమతమకుతోచిన విధంగా భావించారు. వీరచోడవ్వ భీమేశ్వరుని స్తుతించింది. భీమేశ్వరునినుండి ఏమీ బదులు లేదు. జనులు వీరచోడమను నిందించారు. వీరచోడమకు కోపం వచ్చింది. దేవదేవుడైన భీమశంకరుని నిందించింది. భీమేశ్వరుడు సాక్షాత్కరించాడు. అందరూ అభయం వేడారు. వీరచోడవ్వ భీమేశ్వేరుణ్ణి భక్తి తన్మయురాలై స్తుతించింది.

భీమేశ్వరుడు 'పులగం భుజించడంనిజ'మని స్వయంగా చెప్పాడు. 'నాకు శక్తి, కలిమి, వంశం ముఖ్యంకాదు. అవన్నీ బాహ్య విషయాలు. భక్తులే నాకు ప్రాణబంధువులు' అని స్పష్టంగా పలికాడు. వీరచోడవ్వను 'మహాభక్తురా'లన్నాడు. 'ఏంకావాలో కోరుకొ'మ్మన్నాడు'. 'నీదర్శన భాగ్యం కన్న ఏంకావాలి? కానీ ఒక్క కోరిక కోరుతున్నా'నని అంటూ 'ఇక్కడి ఈ

ప్రజలంతా కొలుస్తుండగా కైలాసంలో ఉండాలన్నది నాకోరిక అని చెప్పింది. అప్పుడు శంకరుడు వీరచోడవ్వతోపాటు పురజనుల్ని కూడా కైలాసానికి తీసుకొని వెళ్ళాడు.

యక్షగాన రచనాంగాలు:

యక్షగానాల్లోని ప్రధాన రచనాంగాలన్నీ దాదాపుగా వీరచోడవ్వ చరిత్రలో ఉన్నాయంటే ఆశ్చర్యపడ నవసరంలేదు. ఇందులో పదాలు-31, గేయాలు-60, వచనాలు-67 ఉన్నాయి. ఇందులోని గేయాలకు రాగనిర్దేశం చేయబడలేదు. తాళనిర్దేశం మాత్రం ఉంది. ఈ యక్షగానంలో ఛందో వైవిధ్యం స్పష్టంగా కనిపిస్తుంది. క్రింది పట్టికలో ఛందోవైవిధ్యాన్ని గమనించవచ్చు.

**పద్యాలు - 31**

| | | |
|---|---|---|
| కందం - 6 | ఆర్యాకందం - 1 | తేటగీతి - 5 |
| ఆటవెలది - 4 | ద్విపద - 11 | సీసం - 3 |
| | శార్దూలం - 1 | |

**గేయాలు - 60**

| | | |
|---|---|---|
| అటతాళం - 8 | త్రిపుట - 2 | మటిమ రేకులు - 3 |
| జంపె - 16 | అర్ధచంద్రికలు - 5 | పాళి రేకులు - 2 |
| నడలు - 5 | ధ్రువతాళం - 1 | కురుచ జంపె - 1 |
| ఏకతాళం - 2 | అనువులు - 3 | బౌళ(ళి) రచ్చలు - 2 |
| ఏలలు - 1 | పదములు - 2 | కాంభోజ రేకులు - 1 |
| కళికలు - 1 | ధవళం - 1 | ఆహిరి రేకులు - 1 |
| త్రిభంగి - 1 | పెండ్లిపాట - 1 | ప్రాస రేకులు - 1 |

**వచనాలు - 67**

మాత్రాఛందస్సులోని గేయాలను లోతుగా పరిశీలించడానికి సాహిత్యంతో పాటు సంగీతంలో కూడా ప్రవేశం ఉంటేనే వీలౌతుంది. ఉన్న పరిజ్ఞానంతో కొన్ని సవరణలు చేయడం జరిగింది. 'ఏమె కూతుర' అన్న గేయాన్ని 'జంపె'గా పేర్కోవడం జరిగింది. కానీ అందులో 'జంపె' నడకలేదు. అది 'త్రిపుట' గతిలో సాగింది. అదేవిధంగా 'కోరయియ్యఁగదవె' అన్న గేయం 'ధ్రువతాళం'గా చెప్పబడింది. అది త్ర్యస్రగతిలో నడచింది. 'ఆదితాళం'. 'పరిచయ జూటసుధాకరా' అన్నగేయం 'అటతాళం'గా పేర్కొబడింది. అందులో 'అటతాళ' గతిలేదు. దాన్ని 'ఏకతాళం' చతుర స్రగతిగా సవరించడం జరిగింది. 'నీలకంఠుడు ఈమె కెంతటి' అన్న పాటను 'ఆదితాళం' గా పేర్కోవడం జరిగింది. కాని అందులో దానికి బదులుగా 'అటతాళ' గతి ఉంది. రాగం పేరుతో రేకులను పేర్కొనటం బుక్కము సాంబయ్య రచించిన 'భల్లాణరాజ చరిత్ర'లో ఒకేఒక చోట ఉందని 'ముఖారి రేకుల'ను పేర్కోవడం జరిగింది.[1] అయితే, చినకపోతయ్య రచించిన ఈ యక్ష గానంలో ఇలాంటివి రెండు కనిపి స్తున్నాయి. 1. ఆహిరిరేకులు 2. కాంభోజిరేకులు. ఇవికూడా రాగాల పేరుతో ఉన్నరేకులే.

**శివభక్తులు:**

పరిమితిలో చిన్నదైన ఈ యక్షగానకృతిలో సందర్భోచితంగా కవి ఎందరో శివభక్తుల్ని పేర్కొన్నాడు. ఆ విధంగా పేర్కోవడంవల్ల కథా సందర్భానికి బలం చేకూర్చబడింది. సందర్భానికి తగినవిధంగా ఇతరభక్తుల కథల్నిచెప్పి పటిష్ఠంగా కథను నడపటం బసవపురాణం, పండితారాధ్య చరిత్రల్లోకూడా ఉన్న విషయమే. చినకపోతయ్యకు వీరశైవాంధ్ర సాహిత్యం తో ఉన్న లోతైన పరిచయాన్ని ఈ విషయం వ్యక్తం చేస్తోంది. ఆ విధంగా పేర్కొన్న శివభక్తులంతా బసవ పురాణం, పండితారాధ్య చరిత్రలలోనివారే.

1. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర. పుట. 235.

క్రిందివి ఆ శివభక్తుల పేర్లు- అంబెన / అంబెణ్ణ, అడిభర్త, అమ్మవ్వ, అరసవ్వ, కెంబావి భోగయ్య, కదిరవ్వ, కన్నప్ప, కమలవ్వ, కరికాలచోడుడు, కాళప్ప, కుమారపాల ఘూర్జరుడు, గుండయ్య, గుడ్డవ్వ, గొడగూచి, చిఱుతొండడు, చెన్నప్ప, చేరమ, చేరమరాయడు, చోడభూపాలుడు, తిలకవ్వ, తేడరదాసి, నంబి / నంబెణ్ణ, నరసింగనయనారు, నిమ్మవ్వ, పరమనాచి , పిట్టవ్వ, పురాణభట్టు, బాణుడు, బావూరి బ్రహ్మయ్య, భల్లాణరాయడు, మలయరాజయ్య, మేదర చెన్నడు, రెమ్మవ్వ, వైజకవ్వ, సాంఖ్య తొండమయ్య, సురియచౌడరసు, హలాయుధుడు.

పరిష్కరణ:

వీరచోడవ్వ చరిత్రకు రెండు వ్రాతప్రతులున్నాయి. ఒకటి. D.1941 అనే సంఖ్యగల తాళపత్ర ప్రతి. ఇది మూలప్రతి. వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధనసంస్థ గ్రంథాలయంలో ఉంది. రెండవది D.1940 కాగితపు ప్రతి. ఇది పైప్రతికి పుత్రిక. ఇది మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో ఉంది. ప్రకృత పరిష్కరణ D. 1941 అనే మూలప్రతిని ఆధారంగా చేసుకొని సాగింది.

మూలప్రతి వివరాలు : పొడవు - 28.5c.m, వెడల్పు - 3.1c.m, పత్రాల సంఖ్య - 40, పంక్తులు పుటకు 6, అక్షరాలు పంక్తికి దాదాపు 42. ప్రతిలో వ్రాత చక్కగా ఉంది. ఈ పరిష్కరణలో క్రిందిసవరణలు చేయడం జరిగింది.

1. ప్రాచీన లేఖన సంప్రదాయమైన వలపల గిలకను పరిహరించడం:

భగ - భర్గ, ఉవి - ఉర్వి, కీతి - కీర్తి, అథి - అర్థి,

నేపు - నేర్పు, అథ చంద్రికలు - అర్థచంద్రికలు, మొదలైనవి.

2. శకటరేఫను తగినచోట్ల ఉంచడం:

మఱి, మీఱు, అందఱు, జాఱు, విఱుగు, దూఱు, ఎఱుఁగు,

గుఱ్ఱము, పిఱుఁదు, మొదలైనవి.

3. పూర్ణబిందు పూర్వక ద్విత్వహల్లును అద్విత్వంగా మార్చడం:

లలితాంగ్గ - లలితాంగ, శంక్కరాభరణ - శంకరాభరణ,
వసంత్తుడు - వసంతుడు, నుతించ్చు - వినుతించు,
రొంప్పిచెరుల - రొంపిచెరుల మొదలైనవి.

4. పూర్ణబిందు పూర్వక అనునాసికద్విత్వ, అనునాసికసంయుక్తాల్లో బిందువును తొలగించడం:

ప్రసంన్న - ప్రసన్న, సొంమ్ముల - సొమ్ముల, నింమ్మవ్వ - నిమ్మవ్వ, ఏమనుచుంన్నారు - ఏమనుచున్నారు, జాంహ్నవి - జాహ్నవి, పుంణ్యచరిత్ర - పుణ్యచరిత్ర మొదలైనవి.

5. పూర్ణబిందు పూర్వక అద్విత్వహల్లున్నచోట్ల అర్ధానుస్వారాన్ని ఉంచడం:

వాండు - వాఁడు, బాంపని - బాఁపని, కాంబోలు - కాఁబోలు,
వేండు - వేఁడు, చాంచున్ - చాఁచున్, దాంచున్ - దాఁచున్,
కూంక - కూఁక, కూంతురు - కూఁతురు మొదలైనవి.

6. రేఫ ఉండవలచిన చోట్ల వట్రువసుడిని పరిహరించడం:

భదృడు - భద్రుఁడు, సుకవీందృడు - సుకవీంద్రుఁడు,
వినుత చరితృడు - వినుత చరిత్రుఁడు, దర్వీకరేందృండు - దర్వీకరేంద్రుండు, తృంచు - త్రుంచు మొదలైనవి.

7. 'ఏ'త్వానికి 'ఎ'త్వం, 'ఓ' త్వానికి 'ఒ'త్వం, 'ఈ'త్వానికి 'ఇ'త్వం, ఉన్నచోట్ల సవరించడం:

(a) మెత - మేఁత, గణెశుడు - గణేశుఁడు, తెనియ - తేనియ, వెడుక - వేడుక మొదలైనవి.

(b) శొభిల్లు - శోభిల్లు, తొడ్కొని - తోడ్కొని, చినకపొతయ్య - చినకపోతయ్య, చకొరలొచన - చకోరలోచన మొదలైనవి.

(c) కిలెఱిగి - కీలెఱిఁగి, నిలకంఠుడు - నీలకంఠుఁడు, విరుని - వీరుని, నిలపుసరులు - నీలపుసరులు మొదలైనవి.

8. 'చ' వర్ణానికి బదులు 'శ' వర్ణముంటే సవరించడం:

భోంశయ్యగ - భోంచెయ్యగ, పూజశాయ - పూజచేయ,
శేయు - చేయు, మొదలైనవి.

9. 'స' వర్ణానికి బదులు 'శ' వర్ణముంటే సవరించడం:

శిరులు - సిరులు, శీమ - సీమ, శేవింప - సేవింప, మనశిజుడు - మనసిజుఁడు, శింధువు - సింధువు, శిక - సిక, శింహము - సింహము మొదలైనవి.

10. అల్పప్రాణ ముండవలసిన చోట మహా ప్రాణముంటే సవరించడం:

ఘాలి - గాలి, ఘణియించు - గణియించు, ఘట్టిగా - గట్టిగా,
ధీమసము - దీమసము, భావ - బావ మొదలైనవి.

11. ఉచ్చారణ కనుగుణంగా రాయడానికి చేసిన ప్రయత్నాలనిపించే కొన్ని రూపాలను సరిదిద్దడం:

సింహ్వామధ్య - సింహమధ్య, సింహ్వాసనము - సింహాసనము, విషసంహ్వారుడు - విషసంహరుడు, పెంళ్ళికూతురు - పెండ్లికూతురు, పెంళ్ళిపెద్దలు - పెండ్లిపెద్దలు, నిమ్మపంళ్ళు- నిమ్మపండ్లు, పంద్రెండేంళ్ళు - పంద్రెండేండ్లు, పాలిళ్ళు - పాలిండ్లు మొదలైనవి.

12. యక్షగానం గాన యోగ్యమైంది కూడా కాబట్టి హ్రస్వాలను కొన్ని మాత్రలకాలం సాగదీయడం సహజంగా కనిపిస్తుంది. ఈ సాగదీయడం గేయాల్లోనే కాకుండా వచనాంతాల్లో, పద్యాంతాల్లో కూడా కనిపిస్తోంది. అటువంటి చోట్ల హ్రస్వీకరించడం:

| | | |
|---|---|---|
| వచనాంతాల్లో: | కొనియాడుచున్నాడూ | - కొనియాడుచున్నాఁడు. |
| | స్తుతియించుచున్నాడూ | - స్తుతియించుచున్నాఁడు. |
| | యెటువలెనూ | - యెటువలెను. |
| | యేమనుచున్నాడూ | - యేమనుచున్నాఁడు. |

| | | |
|---|---|---|
| పద్యాంతాల్లో: | యిరవు శోభిల్లు శంకరేశ్వరుని గొలుతూ | (గొలుతు) |
| | సమ్మతి వినుతింతు భక్తి సంపద గల్గనూ | (గలుగన్) |
| | వచ్చినట్టి చోటికిచ్చు కొనుడా! | (కొనుఁడ) |
| | అనుచు నస్త్రాద్రి చాటుకుఁజనియె నినుడూ | (నినుఁడు) |

13. పైనపేర్కొన్నవే కాకుండా వ్రాయస కాని పొరపాటువల్లనో, లేక ఏ ఇతర కారణాల వల్లనో జరిగిన లోపాలను సవరించడం:

మెరసె - మొఱసె, మెరయంగ - మొఱయంగ, ఎల్లజు - ఎల్లను
కిరీటులు - కిరాటులు, దిగంబరిభాగమున - దిగంబరభావమున,
కనుగొను - కనుఁగొన, బన్నిష - బల్నిష్ఠ,
కులసమాజ్య - కులసమాఖ్య, సత్యాదేవిన్ - ఆసతిదేవిన్,
ఈడుకుపదగు - ఈడుకుపెదగు (పెద్ద), తూకువల - తేఁకువల,
దాలాంకృత - పాలంకృత, గపయ - గణపయ,
రాహువుకెదవ - రాహువుకెడన, కూమారుడు - కూచిమారుడు,
శైలకుల పవిత్రుడు - శైవకుల పవిత్రుడు.

ఇటువంటి వానిలోముఖ్యమైంది కుకవినింద సందర్భంలో ఉంది. 'కుకవుల నేమని తెగడుచున్నాడు' అని ఉండవలసిన చోట పూర్తి వ్యతిరేకంగా 'సుకవుల నేమని తెగడుచున్నాడు' అని ఉంది. దీన్ని సవరించడం జరిగింది.

***

# వీరచోడవ్వ చరిత్ర

(యక్షగానము)



గుఱ్ఱము చినకపోతయ్య

# వీరచోడవ్వ చరిత్ర

(యక్షగానము)

శ్రీరాగలలిత! సుస్థిరభావ! కల్యాణ
చరిత! గౌరీప్రియ! సలలితాంగ!
శంకరా! ऽऽభరణభుజంగ! నీలాంబర
సన్నుత! భైరవజనక! భర్గ!
మలహర! యభవ! రామక్రియాన్వీత! దేవ!
గంధర్వ యక్షలోక ప్రసన్న!
కాంభోజ సౌరాష్ట్ర గౌళ భూపాల సం
సేవిత పాదరాజీవ యుగళ!
యనుచు ననురాగమతిఁ గొనియాడి, విబుధ
జన మహీజాత నివహ వసంతుఁ డగుచు
సిరులు దయసేయుచును రొంపిచెరుల పురిని
ఇరవు శోభిల్లు శంకరేశ్వరునిఁ గొలుతు.

అని శ్రీరాగాది రాగంబుల వినుతించి, సకలలోక వశంకరుండగు శంకరుని మఱిన్నేమని కొనియాడుచున్నాఁడు.

జంపె

తలమీఁద నెలవంక - వలచేత నొకజింక
వెలఁది దాపలివంక - గలవానిఁ గొలుతున్
వలరాచ మైపూఁత - చిలువసొమ్ముల మోఁత
కొలఁదిమీఱిన మేఁత - గలవానిఁ గొలుతున్
పులిపట్టు పుట్టంబు - కలిమిగల చుట్టంబు
తెలిగట్టు పట్టంబు - గలవానిఁగొలుతున్.

వ. అని భీమశంకరుని వినుతించెనఁట! యెటువలెను.

పదలు

హరునీ సురనది - ధరునీ విషసం
హరునీ భీమశం - కరునీఁగొలుతున్.
గురునీ నిఖిలసం - చరునీ యిందుశే
ఖరునీ భీమశం - కరునీఁగొలుతున్
వరునీ నగధర - శరునీ గణహిత
కరునీ భీమశం - కరునీఁగొలుతున్.

వ. అని తద్దేవియగు పార్వతీదేవి నేమని స్తుతియింపుచున్నాఁడు.

పదలు

అంబకు పుణ్యక - దంబకు, లోక వి
డంబకు సుగుణా - లంబకు శరణూ!
కాళికి అభవ స - మేళికి, కరకం
కాళికి దైత్య వి - భాళికి శరణూ!
గౌరికి దక్షకు - మారికి, దురితవి
దూరికి విమల వి - చారికి శరణూ!

వ. అని స్తుతియించి, అయ్యాది దంపతుల కగ్రసుతుండగు గణపతి నేమని ప్రణుతింపుచున్నాఁడు.

బౌళరచ్చలు

తేజాముతో కన్నపు - తేజీనెక్కి, జనులు
పూజాచేయా దిరుగు - జేజేకు జేజే!
గుజ్జారూపమూ తోడ - గజ్జాలు మొఱయంగ
బొజ్జా ద్రిప్పచూనాడు - ఒజ్జాకు జేజే!
వియ్యాముతో వినుతి - చెయ్యాఁబూనిన విద్య
లియ్యాఁజాలిన వెన - కయ్యా[1]కు జేజే!

వ. అని తదీయానుజుండగు కరుణాసముద్రుని రాచవీటి వీరభద్రు నేమని కొనియాడుచున్నాఁడు.

పదలు

ధీరుని పుణ్యాశ - రీరుని లోకా
ధారుని శరభావ - తారునీఁదలఁ తున్
శూరుని విమలవి - చారుని మహితో
ద్ధారుని శరభావ - తారునీఁ దలఁతున్
వీరుని కీర్తి వి - హారుని యజనవి
దారుని శరభావ - తారునీఁ దలఁతున్.

వ. అని భక్తి రసాభిషిక్తులగు భక్తుల నేమని వర్ణింపుచున్నాఁడు.

1. వినాయకయ్య

జంపె

వసుధలో శివభక్తి - యసమానమని పూను
రసికుఁడగు కల్యాణ - బసవని నుతింతున్
కాయజారికి నింతి - నీయఁజాలిన దాత
రాయఁడగు భల్లాణ - రాయని నుతింతున్
ఖండేందుమౌళికిని - దండిగాఁ బుత్రకునిఁ
దుండించి పెట్టు చిఱు - తొండని నుతింతున్
కాయంబు తనకు నా - దాయంబె యని తనదు
కాయంబు నొసఁగెడు హ - లాయుధు నుతింతున్
చెప్పఁ జిత్రముగఁ గా - ళప్పకును దనకన్ను
లర్పణముచేయు క - న్నప్పను నుతింతున్.

కం. నిమ్మవ్వను, తిలకవ్వను
అమ్మవ్వను, వైజకవ్వ, నా కమలవ్వన్
రెమ్మవ్వను, అరసవ్వను
సమ్మతి వినుతింతు భక్తి సంపద గలుగన్.

వ. అని సుకవీంద్రుల నేమని పొగడుచున్నాఁడు.

**అటతాళము**

శివహితార్థముగాఁగ తత్త్వవి - శేషమెల్లాఁ జెప్పిన
భవవిదూరుల నవకవీంద్రులఁ - బ్రస్తుతింతున్.
ఫాలలోచనుఁ గొలుచు శరణుల - లీలలెల్లాఁ జెప్పిన
పాలకురికీ సోమనాథునిఁ - బ్రస్తుతింతున్
మఱియు నీశ్వరుమీఁదఁ గృతులు చ - మత్కృతులుగాఁ జెప్పిన
సరసులగు సత్కవుల నందఱి - సన్నుతింతున్.

వ. అని కుకవుల నేమని తెగడుచున్నాఁడు.

కం. నెరవగు సత్కవి రచనల
నొరగులు దిద్దంగ వత్తు రుర్వినిఁ గుకవుల్
సరు లొడిసి తెంచు వానర
మెఱుఁగునె మగుడంగఁ గూర్ప? నిది తెలియరొకో!

ద్వి. అని మహాదేవుని - నర్థిఁ గీర్తించి
వనజాతముఖినిఁ బా - ర్వతిని వర్ణించి
గణనాథుఁ బొగడి,ద - క్షవిరోధి నెన్ని
గణకీర్తనముఁ జేసి - కవులఁ బ్రార్థించి
కుకవులఁ దెగడి,స - ద్గుణముల నెగడి
సకలాధిపతియైన - శంకరేశ్వరుని
వరలబ్ధమునను, రే - వణసిద్ధ గురుని
కరుణచే నెల్ల స - త్కవులఁ గీర్తించి
వీరచోడవ గారి - విమల చారిత్ర
మారూఢమతిఁ బూని - యక్షగానంబుఁ
గావించెదను సుధా - కరమౌళి వంశ
పావనోదయుఁడైన - ఫాలాంకవిభుని
సుతుఁడు, గుణ్ణము గణే - శునికి సౌభాగ్య
వతి సోమమాంబకు - వర్ణితలీల
నుదయించు వాఁడఁ గు - లోద్ధారుఁడైన
పెద కపోతయ్యకుఁ - బ్రియసహోదరుఁడ
ననఘవర్తనుఁడ, రా - చయ్య కగ్రజుఁడఁ
జిన కపోతాఖ్యుండ - శివకవీంద్రుఁడను

గురులింగయతి గణ - గుణ సౌరభంబు
లెఱఁగించు చందంబు - లెల్లను గూర్చి
కారుణ్యనిధికి శం - కరునికిఁ బుణ్య
చారిత్ర మొసఁగితి - సద్భక్తి వినుఁడి!

వ. అని యేనొనర్పంబూనిన కథానిధానంబునకు సుధానిధానంబగు దాక్షారామపురం బెటువంటిది.

**అటతాళము**

భీమనాయకు వామభాగము - ప్రేమతోడాఁజేకొను
రామ పుట్టినయిల్లు దాక్షా - రామపురమూ
దీమసంబునఁ గాముసేనల - నామతింపంగల యా
రామములఁ జెలువొందు దాక్షా - రామపురమూ
రామసంచయ ధామ పంచా - రామములతో నత్యభి
రామమై పొగడొందు దాక్షా - రామపురమూ

వ. మఱిన్ని ఆ దాక్షారామపురం బెటువంటిది.

**జంపె**

లాలిత స్ఫురణ సా - లంకృతంబైనట్టి
సాలములు ఘనసౌధ - జాలములు గలిగీ
భాసురస్థితి ధర్మ - పారీణు లైనట్టి
భూసురులు, నృపకులా - గ్రేసరులు గలిగీ
హాటకంబైన ప - ద్మాధిపత్యముగల కి
రాటులు, నవరవర్ణ - కోటులును గలిగీ

అర్థచంద్రికలు

కవులును బుధపుం - గవులును గలిగీ
రథులును హితసా - రథులును గలిగీ
కరులును రిపుభీ - కరులును గలిగీ
హరులును విక్రమ - హరులును గలిగీ
భటులును శౌర్యో - ద్భటులును గలిగీ

వ. ఇట్లు విజయశ్రీధామంబగు దాక్షారామపురంబున కధీశ్వరుండగు భీమేశ్వరుం డెటువంటివాఁడు.

అటతాళము

చిన్నివెన్నెల పువ్వు చెంపనుఁ - జెలఁగువాఁడూ; వెచ్చని
కన్నుసన్నలఁ దీయు గంధము - గలుగువాఁడూ
కలితమగు పులిపట్టుపుట్టము - గట్టువాఁడూ; మిక్కిలి
బలితమగు ముమ్మొనల కైదువుఁ - బట్టువాఁడూ
ఎలమితోడుత గిబ్బరాయని - నెక్కువాఁడూ; తనపైఁ
దలఁపు నిలిపిన సజ్జనులకును - దక్కువాఁడూ
మెలపుమీఱఁగ విసము బువ్వగ - మెసఁగువాఁడూ; దానికి
నులుకు జేజెలకెల్ల నభయము - లొసఁగువాఁడూ
ఉదుటురక్కసి పాలెములు కడ - కొత్తువాఁడూ; కినుకను
ముదుకచదువుల బాపనయ తల - మొత్తువాఁడూ
భూమినెన్నఁగఁదగిన గుణములఁ - బొరయువాఁడూ; చాళుక్య
భీమలింగంబనఁగఁ గీర్తుల - బెరయువాఁడూ.

వ. ఇటువంటి చాళుక్య భీమేశ్వరుని విలాసినీజనులగు సానిచకోరలోచనల వంశావతారం బెటువంటిది.

ద్వి. మును దారువనములో - ముదితలఁ గూడి
సనకాది మునులు ఈ - శ్వరభక్తి విడచి
వరుస యించుకలేక - వర్తించు టెఱిఁగి
పరమేశ్వరుఁడు దిగం - బర భావమునను
అచ్చటి కేతెంచి - యతివల నెల్ల
మచ్చికతోఁ గూడ - మౌనీంద్రు లెఱిఁగి
కోపించి మాయలు - కొన్ని పన్నుటయు
ఆ పరమేశ్వరుం - డమ్మునీశ్వరుల
అంగహీనులఁగాను - అపుడు శపించి
అంగనా మణుల కి - ట్లని యానతిచ్చె:
'సతులార! పతిహితా - చారంబు లుడిగి
యితరులఁబొందితి - రింతకాలంబు
ఆ నిమిత్తంబున - నవనిలో మీరు
సానివంశంబున - జనియించఁగలరు
ఆ వంశమునఁ బుట్టి - యైనను మమ్ము
సేవింప మోక్షంబు - చేకూరు మీకు'
అని చెప్పి యీశ్వరుం - డరిగిన పిదప
మునికాంత లావంశ - మున జనియించి
సారసౌఖ్యములఁ బం - చారామములను
పేరెన్నికైనట్టి - భీమేశునకును
వరుసతోడుత విట - త్వంబు చేకూర్చి
కరమర్థి మోక్షంబుఁ - గైకొందు రందు.

వ. ఇట్టి సానివంశంబున నెన్నందగు రూపప్రసూన సాయకుండగు మల్లి నాయకుని యంగనాతిలకంబగు నన్నెచోడుకు సంతానంబు లేక కేదారవ్రతంబు పూనె; నటమీఁద నెటువలెను.

సీ. కైలాసగిరి మీఁదఁ గరకంఠుఁ డొకనాఁడు
వేడుకతో జూదమాడుచుండి
నవ్వెన, హిమశైలనందన వీక్షించి
'యెత్తుదప్పదు నవ్వనేటి'? కనిన
'ఇందులకై కాదు ఏణాక్షి విను! దక్ష
వాటి లోపల సానివారలెల్ల
బాలికామణులతోఁ బరిణయంబొనరించి
నను నల్లుఁడని కొల్వ నవ్వువచ్చె'

ఆ.వె. ననియె; కేలుమొగిచి 'యభవ! యామీఁదటఁ
బరిణయంబునకును వెరవు గలుగు
నట్టి వంశమందుఁ బుట్టి మీ చిత్తంబు
వచ్చినట్ల మెలఁగ నిచ్చగలదు'.

వ. అని యమ్మహాదేవుని కీలెఱింగి, శైలతనయ తన నిజాంశంబున నన్నెచోడుకు వీరచోడునుం బుట్టించెనఁట! ఆమె యెటువంటిది?

జంపె

జగదేకనుత రూప - సామర్థ్యమునఁ జూప
నగు సుమ్మీ! రతిజోడు - ఆ వీరచోడు
సలలితంబైన భా - షాధికత్వము పూను
అల భారతికి నీడు - ఆ వీరచోడు
నిరుపమస్థితిఁ బొందు -నిఖిల సంపదలందు
ఏణాంకు సైదోడు - ఆ వీరచోడు.

వ. ఇట్లు రతిరూపంబును, భారతి వాగ్విభవంబును, సిరిసౌభాగ్యంబును, తనయందు నొనంగూడు వీరచోడు రూపప్రభావంబెటువలెను.

**అటతాళము**

విరులు గొల్వఁగఁజాలు నీలపు - సరులయందూ, గలిగిన
సిరులు గైకొను వీరచోడమ - కురులు దలపన్
బిరుదుబిళ్లగు విదియచందురు - బెదురుకొలుపా, నెలనెల
కెదురు చూచును వీరచోడమ - నుదురు తెలివీ
ఇమ్ములను జరియించు మదనుని - యమ్ములకునూ, సవరఁద
నమ్ము లొసగఁగును చోడు కనుఁగొన - లిమ్ములెన్నన్
అదను వెదకుచునుండు రాహువు - కెడన నుండూ, కళలకు
సదనమన శశిఁదెగడు చోడమ - వదన మరయన్
మెలఁకువలతోఁ బలుకు చిలుకల - కులుకు చేయూ, తేనియఁ
గులుకు చుండెడు వీరచోడమ - పలుకు లెలమిన్
అన్నుఁగవలై జక్కవల నల - మిన్నుసోఁకా, గదుమును
చెన్నుమీఱిన చోడసానెమ - చన్నుదోయీ
అరుదుగా మదకుంభికుంభముఁ - దెగడు పరుచా, దానికి
బిరుదు గట్టును వీరచోడమ - పిఱుఁదు వొగడన్
డంబుగలిగినయట్టి జలజాతంబులకునూ - తగిన ప
దంబు లొసఁగును వీరచోడు ప - దంబు లెంచన్

వ. ఇట్టి రూపంబు గల వీరచోడు తనయాడు చేడియలంగూడి, నృత్య గీతాదు లభ్యసించఁబోవునెడ పురజనులేమని కొనియాడుచున్నారు.

**ఆటతాళము**

నీలకంఠుఁడు ఈమె కెంతటి - మేలువాఁడో! ఓహో!
నీలకంఠము కప్పుకొప్పున - నిలిపినాడూ
చంద్రశేఖరుఁ డీమె కెంతటి - చనువువాఁడో! ఓహో!
చంద్రరేఖను నుదురుగా నిటు - సంతరించెన్

ఇందుధారణుఁ డీమెకెంతటి - హితవువాఁడో! ఓహో!
ఇందుబింబమె ముఖముగా నిటు - లెలమిఁ జేసెన్
ఏణహస్తుఁడు ఈమె కెంతటి - ప్రాణప్రదమో! ఓహో!
ఏణసంతతిఁ దెగడు చూపుల - నిచ్చినాడూ
కొండయల్లుఁడు ఈమె కెంతటి - కూర్మివాఁడో! ఓహో!
కొండలే పాలిండ్లుగాఁ జే - కూర్చినాడూ
శేషభూషణుఁ డీమెకెంతటి - చెలిమివాఁడో! ఓహో!
శేషువును నూగారుగా నిటు - చేసినాడూ
ధారుణీధరుఁ డీమెకెంతటి - తనవశంబో! ఓహో!
ధారుణీస్థలి పిఱుఁదుగా నిటుఁ - దనరఁజేసెన్.
అసమనేత్రుఁడు ఇట్టిరూపం - బొసఁగకున్నా, ఓహో!
ముసలిచదువుల బాపనయ్యకు - వశమె చేయన్.

ద్వి. అని యిట్లు పురజను - లభినుతి చేయ,
ననిశంబు వీరచో - డవ్వ చాళుక్య
భీమేశు కథలును - బిరుదు గద్దియలు
నేమించి చదివి బ - ల్నిష్ఠ నెఱింగి
వలవొప్ప నిట్టి దై - వత సార్వభౌముఁ
డిలవేల్పు తనకని - యిచ్చలో నమ్మి,
అతనికిఁదనదు ప్రా - యము మీఁదుకట్టి
అతిమోదమున నున్న - యవసరం బెఱిఁగి
పెనుపరి మదనుండు - భీమేశు మీఁది
కినుక చోడవ్వపైఁ - గెరలెనో యనఁగ
సాహసంబున నిక్షు - చాప మెక్కించి
మోహనాస్త్రము వేసి - ముదలకించుటయు
పులకించి చెక్కిళ్లఁ - బొడమిన చెమట

లలసతఁ దుడిచి, ప - య్యెద చలించుటయు
కప్పుజాఱిన చీర - కట్టు సంధించి
కొప్పున వాడిన - క్రొవ్విరుల్ ముడిచి
ఒరు లెఱుంగకయుండ - నుద్యాన వీథి
కరుదెంచి వీరచో - డవ్వ తానపుడు

కుఱుచజంపె

కీరములపై నలుక - గీలించున్ - అల్ల
శారికలతో పొందు - చాలించున్.
కోవెలల రొద విన్న - కోపించున్ - పువ్వు
తావులకు మిగులంగ - తాపించున్.
కామునికి భయసమ - గ్రత వీఁగున్ - చంద
మామయ్యే రాకలకు - మది లోఁగున్.

అర్థ చంద్రికలు

మలయానిలునకు - మాటికి నులుకున్
అలి సంతతులకు - అలుకుచునుండున్
గమనము నేర్పదు - కలహంసలకున్
తములము చేయదు - తహతహనొందున్
పాడదు గీతము - పరిపరి గతులన్
ఆడదు నాట్యము - అలసటఁ గందున్.

వ. ఇట్లు విరహభావంబున వీరచోడు తనమనంబున నేమని వితర్కింపుచున్నది.

అటతాళము

కన్నె, గాముని వలపులోనై - యున్నదానా, నను గను
గొన్న నిక మా నన్నెచోడమ - కోపగించున్
ఉరగభూషణు మీదికూరిమి - మఱుఁగు చేయాఁ బూనఁగ
తరముగా దీ వలపునిలుపఁగ - దనవశంబే!
చెలుల తోడుత నీరహస్యము - దెలుప నిపుడూ నా మది
గొలుప;దిక యీవేళ కోరిక - గూడఁ గలదే!
పలుకు తోడని నమ్మి పెంచిన - చిలుక నేడూ మదనుని
బలము లోపలఁ గలసి మిక్కిలి - వదరఁదొడఁగెన్
కామికంబుగ నొక్కకుత్తుక - గా మెలంగూ కోవెల
ఏమి చిత్రమొ! కూఁకలిడి మరు - లెచ్చఁజేసెన్
మదినిఁ బుట్టిన కనికరంబిటు - వదలి మరుఁడూ తా నిపు
డెదిగి మానధనంబు శివునకు - నియ్యకొలిపెన్
నీటుకాఁడై చందురుఁడు మో - మోట మింతా దలఁపక
గా టముగనిటు వేఁడి వెన్నెలఁ - గాయఁబూనెన్
మలయ పవనుఁడు ప్రాణపదమని - కలసిమెలసీ తిరుగక
చలము తోడుత నిపుడు వడ పైఁ - జల్లఁజొచ్చెన్
హరిణధరుఁడగు భీమలింగము - కరుణ నాపైఁ గలిగినఁ
గెరలి పైకొను మదను బలములఁ - గెలువ వచ్చున్.

వ. అని మదనచంద్రాదుల నేమని దూషింపుచున్నది.

**అటతాళము**

చెఱకువిల్తుఁడు దుండగీఁడని - యెఱిఁగి కాదే రుద్రుఁడు
చుఱుకుఁగంటను వానిఁగరుఁగగఁ - జూచినాఁడూ
చందురుఁడు కుటిలాత్ముఁడని తెలి - వొందికాదే పాదము
నందుఁ జిదిపెను వీరభద్రుఁడు - యజ్ఞవాటిన్
మలయపవనుఁడు చంచలుండని - తెలిసికాదే భుజగము
లలుక తోడుత జారిపోనీ - యక మెసంగున్
కోకిలంబులు ఇట్లు వంచన - చేయఁగాదే కాకము
లేకబిగిఁదల చూపనియ్యక - యెఱిఁగి చెనకున్
చిలుక చదువని దూషితంబుగఁ - బలుకఁగాదే భూమిని
వెలయనీయక పంజరంబుల - వేయుటెల్లన్
మధుపకులముకు మేర లేదను - విధమెఱింగీ చంపక
మధిక సౌరభమునకు ముసరిన - యపుడె యణఁచున్.

వ. అని మదనచంద్రాదుల దూఱి, వీరచోడు తనమనంబున
భీమేశ్వరుం బేర్కొని యేమనుచున్నది.

**త్రిపుట తాళము**

దారువనమున మౌనికాంతలఁ -
దవిలితిరిగెడు విటవరుండును
కోరికలు ఏవేళఁ దా సమ - కూర్పఁగలఁడో?
కూరిమితో భల్లాణరాయని -
కులవధూమణి నడుగు నొడయఁడు
చేరి యెన్నడు నన్ను లాలన - చేయఁగలఁడో?
కోరి యీపురి వారకాంతలఁ -
గూడియాడెడు భీమలింగము
వేరు చేయక యెన్నడిఁక చను - వియ్యఁగలఁడో?

వ. అని మనోవీథిని భీమేశ్వరుని సాన్నిధ్యంబుచేసికొని యేమనుచున్నది.

ఆహిరి రేకులు

పల్లవి॥ 'నే చిన్నదానాను భీమేశా! నన్ను
ఏఁచీనఁ గాదయ్యా! భీమేశా!
పూచీన పొదమీఁద భీమేశా! గాలి
వీచీనఁ గాదయ్యా! భీమేశా!

పదము॥ గాయాకమున నన్ను భీమేశా! పంచ
సాయాకుఁడేయాఁగ భీమేశా!
దాయాక వుండూట భీమేశా! యిది
నాయాక మటవయ్యా భీమేశా !
మాయాల జాబిల్లి భీమేశా! వేఁడి
ఛాయాలు చూపంగ భీమేశా!
కోయీల లెల్లాను భీమేశా! అల్ల
దాయాలఁ గూడేను భీమేశా!
పాయాము నీసొమ్ము భీమేశా! నీ యు
పాయాముతోఁబొందు భీమేశా!
నాయామెఱిఁగి వేగ భీమేశా! ఇది
నాయామె కాదయ్యా! భీమేశా!

కాంభోజి రేకులు

పల్లవి॥ ఈవేళ వచ్చినను భీమేశా!
మోవి లంచమిచ్చెద నీకు భీమేశా!
నీవెంత చేసినను భీమేశా!
నే వింత చేయనయ్యా! భీమేశా!

పదము॥ గొబ్బునను పైకొన్న భీమేశా!
గుబ్బలను గదుమనయ్య! భీమేశా!
భావమెఱింగి వేగ భీమేశా!
నీవి జాఱనిచ్చెదా భీమేశా!
వలపొత్తి చూచుటకు భీమేశా!
అలిగి పవళించ నో భీమేశా!
కతవెట్టెద నపుడె భీమేశా!
రతుల మెప్పించుటకు భీమేశా!'

కం. అని యిట్లు వీరచోడమ
ననిచిన మోహమున భీమనాయకుఁజాలా
వినుతింపుచున్న వేళను
చనుదెంచెను నన్నెచోడు సయ్యననటకున్.

వ. అట్లు చనుదెంచి, నన్నెచోడు కూఁతు నీక్షించి యేమనుచున్నది.

త్రిపుట తాళము

'ఏమె కూఁతుర! నేడు నీ విపు - డేకతంబున నున్నదానవు?
నీ మనోరథమందు ఎవ్వని - నిలిపినావే?
ఇంటివేల్పగు భీమలింగము - కేను నీ ప్రాయంబు మీఁదని
యుంటి నన్నిటు మీఱి పలుకఁగ- నుచితమఁటవే?
వలవకే వలపింపనేరఁగ - వలయుఁగా, కిటువలెను నీవై
వలచి పైకొనఁజూచి నీసరి - వారు నగరే?
ఎన్నఁ గుదురగు వేయిమాడలు - ఇయ్యఁగాచుక వున్నవారికి
సున్నపాకును నియ్యఁగొలుపదు - నిన్నుఁ జూచీ

అనుదినంబును విటులనడవడు - లరసి పొందెడు నేర్పుఁ గనవలె
వినవె! నాచేఁ దెలియు నీవిఁక - వీరచోడూ!
వన్నెకాఁడితఁ డనఁగ వలదని - చిన్నెలే పచరించు హస్తినిఁ
గన్నుసన్నలఁ దీర్చు భద్రుడు - ఎన్నిచూడన్
ఎదిరి యింపెఱుఁగంగఁజాలక - యీవి మిగులఁగ నొసఁగుశంకిణిఁ
గదియఁగోరును దత్తకుం డధి - కారముగనూ
మందులను మంత్రముల మాయల - మరులుఁ గొలుపుచుఁ చేరుచిత్తినిఁ
బొందఁగోరును కూచిమారుఁడు - పూనినపుడే
బాలలను జవ్వనులఁ బ్రౌఢుల - లీలలను గరఁగించుఁ బద్మిని
మేలువాఁడని యెన్నఁదగు పాం- చాలుఁ డెలమిన్
వీరికెల్లను నాదిగాఁగల - విటవరుండగు భీమలింగముఁ
జేరిపొందుటకంటె మిగుల వి - శేష మేదే?

తే.గీ. మన కులస్వాములకు నెల్ల - మనసు రాను
భీమలింగంబునకు నిన్ను - బెండ్లి చేతుఁ;
బిదప నీయిచ్ఛ; నేడింకఁ - బెండ్లి కూఁతుఁ
జేయఁగావలె రావమ్మ! - చిగురుఁబోణి!'

వ. అని యనుకూలంబుగాఁ బల్కి, 'నీవలపుఁ దెలుపక పరిణయంబు చేయ నాయంబుగా'దని వెఱపు పుట్టించిన, మరలింపఁజాలక యబ్బాలిక సమవిషమవల్లియగు తల్లి నీక్షించి యేమనుచున్నది.

ఏక తాళము

'ధనపతి మిత్రునకూ - దుర్భర
వనధి వహిత్రునకూ

మనసిజ శత్రునకూ - వలచితి
వినుత చరిత్రునకూ
గణమందారునకూ - మదవా
రణ సంహారునకూ
ఫణిభృత ధారునకూ - వలచితి
గుణమణి హారునకూ
కరధృతయేణునకూ - భువనో
త్కర నిర్మాణునకూ
గిరిధర బాణునకూ - వలచితి
శరనిధి తూణునకూ'

ద్వి. అని యిట్లు భీమనా - యకు మీఁది కూర్మి
తనకుఁ జెప్పుటయు సం - తసమంది తల్లి
కరమర్థిఁ జోడవ్వఁ - గౌఁగిటఁ జేర్చి
శిరమమూర్కొని, ముద్దు - చెక్కులు మీఁటి
'కుల ముద్ధరించిన - కూఁతుర వీవు
తలఁతువే కులదైవ - తము గాక యొరుని
సమ్మతంబది మాకు - జలకంబుఁ దీర్చి
సొమ్మెల్లఁ బెట్టుకు - చూడుము తేఱి
వెఱవంగ నిచ్చట - వింత వారేరి?
తెఱవ! యేనుఁగు నెక్కి - దిడ్డి దూరుదురె?
భీమనాయకుఁడు నీ - పెనిమిటి యైన
నీమీఁదఁ గినియంగ - నేరఁడు మరుఁడు'.

వ. అని యూరడిలఁ బల్కి, వీరచోడుఁ జెలువంబుచేయ చెలుల నియమించి, తాను శోభనద్రవ్యంబులు గూర్చఁబోయె; నటమీఁద నెటువలెను.

అర్ధచంద్రికలు

సరసిజేక్షణ కొకతె - శిరసంటె వేగన్
లేమ కొక్కరితె గం - ధామలక మిడియెన్
కలకంఠి కొక్కరితె - జలకంబుఁ దీర్చెన్
హరిమధ్య కొక్కరితె - కురులు తడి యొత్తెన్
రమణి కొక్కరితె చే - లముఁగట్ట నిచ్చెన్
బాలికకు నొక్కరితె - కీలుజడ యల్లెన్
పొలఁతి కొక్కరితె పు - వ్వులదండ చుట్టెన్
కరియాన కొకతె క - స్తురిబొట్టు వెట్టెన్
సుందరికి నొక్కరితె - గంధంబు పూసెన్
తరుణి కొక్కరితె యా - భరణములు వెట్టెన్
శుకవాణి కొక్కరితె - ముకురంబు చూపెన్
తెఱవ కొక్కరితె క - ర్పూరవిడియ మొసఁగెన్.

వ. ఇట్లు నెచ్చెలులు పెండ్లికూఁతుఁ గైసేసి తెచ్చినంజూచి, యిచ్చ లో మెచ్చి, నన్నెచోడు తన బంధు జనంబులను రప్పించి గంధాక్షతంబు లిప్పించి, కరంబులుమొగిచి కులసమాఖ్య ప్రకారంబుగా నేమనుచున్నది.

ఆ.వె. 'కులము తల్లిదండ్రి తెలియంగ నా మాట
వినుఁడు! మ్రొక్కి మీకు విన్నవింతు
చోడు పెండ్లి కెదిగె; చూచి మీ చిత్తంబు
వచ్చినట్టి చోటి కిచ్చు కొనుఁడ!'

వ. అనుటయు గంభీర సింధువులగు బంధువులు సంతసిల్లి, తల్లి వీక్షించి యేమనుచున్నారు.

జంపె

'భీమలింగంబునకు - నీయ మెచ్చితివని
మామనసు వచ్చు అర - మరలేని తావు
ఎద్దు ఏఱును[1] గలిగి - యెల్లకాలము నొక్క
కొద్దిసంసారిలా - గున నుండు నతఁడు
గట్టుమీఁదట నైనఁ - బుట్టు నన్నము వాని
కెట్టి చిత్రమొ! కాని - యెఱుఁ గంగరాదు
తలిదండ్రిఁ జూడరా - తనిఁ జూచి కులగోత్ర
ముల దొడ్డవారు బి - డ్డల నిచ్చినారు
మనకు వారపు జంగ - మని నుతించుట గాదు
ఘనుఁడితఁడె కర్త లో - కముల కన్నిఁటికి'

వ. అని తన యభిమతంబుగాఁ బలికిన, నన్నెచోడు సంతసించి, ఉభయ బలంబులుం గల లగ్నంబునకుఁ దరలి కూఁతును పల్లకీ యెక్కించు కొని, సర్వసన్నాహంబు చేయనియమించి భీమేశ్వరునగరికి వచ్చెనఁట! యెటువలెను.

అటతాళము - అర్ధచంద్రికలు

భేరి శంఖ మృదంగములు గం - భీర నాదము లొలయఁగా బలములు గలయఁగా
చేరి గాణలు మంద్ర మధ్యమ - తారకంబులు పాడఁగా, పాతర లాడఁగా
భామినీమణు లిరుఁగెలంకులఁ - జామరంబులు వీవఁగా, దీవన లీయఁగా

వ. ఇట్లు భీమేశ్వరుని నగరికివచ్చి, దైవతసార్వభౌముండగు భీమేశ్వరునికి నమస్కరించి, కరంబులు మొగిచి నన్నెచోడు ఏమనుచున్నది.

---

1. నంది, గంగ

ఆర్యాకందము. జేజే! భీమయలింగా!
నీవల్లుఁడవైతి విదియె నిజముగఁ జుండీ!
దేవియుఁ జోడక సుండీ!
దేవాధీశ్వరుఁడ వనుచుఁ దెలిసితిఁ జుండీ!

వ. అనుటయు, వివాహంబునకు నంగీకరించి భీమశంకరుండుంకువ యొసంగు కైవడిఁ బ్రసాదకుసుమంబు లొసంగఁ గైకొని, యట మీఁద పెండ్లి పెద్ద లిరుఁగెలంకుల నెచ్చరింపఁ, బురోహితులు పరిణయో చితంబులు నుడువఁగాఁ, బుణ్యపణ్యాంగనలు శోభనంబులు పాడిరఁట! యెటువలెను.

పెండ్లిపాట

శ్రీమించు గోదారి - తీరామునానూ
ప్రేమాతో నెలకొన్న - భీమలింగముకూ
వీరశైవాచార - మారూఢి నడపీ
పేరెన్ని కైనట్టి - వీరచోడమకూ
గౌరీకల్యాణమే! వైభోగమే!
భూమితేరుగ నెక్కి - పురమూలు గెలిచీ
ధీమంతుఁడైనట్టి - భీమలింగముకూ
వారింపఁగారాని - మారూని మాయా
దీర నోపినయట్టి - వీరచోడమకూ
గౌరీకల్యాణమే! వైభోగమే!
కామితంబుగఁ గొల్చు - భక్తుల కెల్లా
కామితార్థము లిచ్చు - భీమలింగముకూ
వారకామినులలో - సారస్యమునమూ
మీఱఁజాలిన యట్టిన - వీరచోడమకూ
గౌరీకల్యాణమే! వైభోగమే!

వ. అని, ధవళంబేగతిఁ బాడుచున్నారు.

ధవళం

జయ జయ శరధినిషంగా!
జయ జయ భూషభుజంగా!
జయ జయ హస్తకురంగా!
జయ జయ భీమయలింగా!

పదములు

జోడున కగునని దక్షుని - వీడున ఆ సతిదేవిన్
వేడుకఁ గైకొను కైవడిఁ - జోడకఁ గైకొను దేవా!
ఈఁడుకు పైదగు[1] మైనాకుని - తోడనుబుట్టిన గిరిజన్
వేడుకఁ గైకొను కైవడిఁ - జోడకఁ గైకొను దేవా!
చూడఁగ నొప్పగు జాలరి - వాడల నాడెడు గంగన్
వేడుకఁ గైకొను కైవడిఁ - జోడకఁ గైకొను దేవా!
ఓడక దారువనంబునఁ - జేడెల నందఱిఁ గలయన్
వేడుకఁ గైకొను కైవడిఁ - జోడకఁ గైకొను దేవా!
నీఁడలుఁ దేఱఁగ నీపురి - మేడలఁ గన్యలఁజేరీ
వేడుకఁ గైకొను కైవడిఁ - జోడకఁ గైకొను దేవా!

వ. ఇట్లు శోభనంబులు బాడ, నత్యంత వైభవంబునఁ బరిణయం బొనర్చి నన్నెచోడుఅల్లునికరణంబు లిచ్చి కూఁతు నప్పగించి, బంధునివహంబులతో గృహంబునకుం జనియె. అట్లు పరిణయంబైన నాలవనాడు ప్రథమశయ్యా కరుహంబు కావునఁ జెలులధిక ప్రయత్నంబున నుండి; రప్పుడెటువలెను.

---

1. పైది + అగు = పెద్దదైన

తే.గీ. 'విభవమున రేయిఁ దన మనోవిభునిఁ జేరఁ
గోరు నవ్వీరచోడవ్వగారు కినిసి
లోకబాంధవుఁ డనక నిరాకరించు'
ననుచు నస్త్రాద్రిచాటుకుఁ జనియె నినుఁడు.

జంపె

శూలహస్తుని జటా - జూటారుణచ్ఛాయ
లీలనెంతయు సాంధ్య - కాలంబు దనరెన్
హరుఁడు కప్పెడు గంధ - కరిదైత్యచర్మంబు
కరణి నెంతయు నంధ - కారంబు వొడమెన్
ఫణిభూషణుని మౌళిఁ - బరఁగు జాహ్నవి తోయ
కణములో యనఁగఁ జు - క్కలు దోఁచె మింటన్.

వ. అంత నేకాంతసౌధంబున శయ్య నలంకరించి, చోడుఁ దోడ్కొని
పోవుచున్న చెలులు మచ్చికతో ఏమనుచున్నారు.

జంపె

విషము మ్రింగిన చేఁదు - విఱుగఁ దియ్యని మోవి
యొసఁగి పోషించుకో - ముసలి జంగమునూ!
గిరిదుర్గ మేలేటి - దొరతిరిపె మితనితో
నొరయించు కుచగిరులు - తర మెఱుఁగుకొనుమీ!
నెలవంక ధరియించు - నెరజాణ మాబావ
మొలపించు నెలవంక - లొలసినన్నియునూ

వ. అని యిట్లు హెచ్చరింపుచు నచ్చెలు లచ్చారులోచనముం బచ్చల
మేడకుం దెచ్చి యునిచి, పని నెపంబునం జనుటయు, భీమేశ్వరుండు

ప్రేమాతిశయముంబునఁ గ్రొత్తపెండ్లికొడుకు కైవడి నత్తలోదరిం జేరవచ్చి, లజ్జావనత గావున బుజ్జగించి కలియందలంచి, శయ్యనుండి నెయ్యంబున నేమనుచున్నాఁడు.

జంపె

'పలుకవేమిటికి నా - పై నేరముండినను
అలుక మోమునఁ దెల్పు' - మని యానవెట్టున్.
'మోవి తేనియఁ గొంత - యీవె నాకిపు'డంచు
వేవేగఁ బైమొగిచి - వినుతింపఁ జొచ్చున్.
'తెలియరాదీ మాట - తిరుగ నాడు' మటంచుఁ
బొలుపొందగాఁ బ్రియం- బులు పలుకఁ బూనున్.
'ఈ వాదమేమిటికి - యిద్దరంబును నొకటిఁ
గావలయునని' తానె - గౌఁగిటను జేర్చున్.
'బలిమి చేసితివేని - కులుకుగుబ్బలు గోళ్ల
కొలఁదిఁ జీరుదు'నంచుఁ- గొనగోళ్లఁ జూపున్.
'ఇదె కొమ్మ! విడియమ్ము - నేనొల్ల నంటివా?
పెదవి నొక్కుదు' నంచుఁ - గదియంగ వచ్చున్.
'జోడుఁగూడకయున్న - తోడి కన్నియలతో
నాడికలు చేయింతు' - నని పంతగించున్.

వ. ఇట్లు నయభయంబుల శయ్యఁ గొలిపి కలుపుకొని, నిమిత్తంబును, స్ఫురితంబును, ఘటితంబును నాదిగాఁగలచుంబనంబులొనర్చుచు; ఛురితంబును, అర్ధచంద్రంబును, మండలంబును నాదిగాఁగల నఖక్షతంబుల నెలువులెఱింగి నిలుపుచు; మూఢకంబును, నుచ్చాన కంబును, ప్రవాళమణి యును నాదిగాఁగల దంతక్షతంబులు మొలిపించుచు; నాగరాజ్యంబును, స్కంధపాదయుగళియు, వేణు

వారకంబును,పంకజాసనంబునునాదిగాఁగల బంధవిశేషంబులం బెనఁగుచు; సమతలంబును, ముష్టియుననందగు తాడనంబులఁ గెరలింపుచు; స్తనితంబును, హూంకృతంబును నాదిగాఁగల గళరవంబులు చేయుచు; కళల వారింపుచు; మరురాజ్య మేలింపుచుండె ; నటమీఁద నెటువలెను.

ద్వి. ఈరీతి మరురాజ్య - మేలింపు చోడు
గారి నుత్తమజాతి - గా నిశ్చయించి,
"వారకాంతలు ధన - వంతులఁ జేరఁ
గోరుదు రటుగాన - గుణియింపరాదు
విటవేషధారినై - విత్తంబుఁ జూపి
కుటిలభావంబునఁ - గుంటెన నంప
నన్నొచోడమ వచ్చి - నయమింత లేక
తన్ను బోధించినఁ - 'దగదు పొమ్మ'నుచు
హితులుచెప్పిన బుద్ధు - లెల్లను వినక
'మితిమీఱ నిన్నె న - మ్మితి' ననమెత్తు"
నని భీమనాయకుం - డవ్వీరచోడు
నెనసి వర్తించిన - ట్లుచ్చటనుండి
తటవటించుటకునై - తానప్పు డొక్క
విటరూపమున వచ్చె - వీథిలోపలికి

వ. అప్పు డెటువలెను.

ధ్రువతాళము

సిక పూలదండ చుట్టి, నుదుటిపై
నొకవేల బొట్టు వెట్టి

వీరచోడవ్వ చరిత్ర

చికిలి యద్దంబు చూచి, పలుమాఱు
ఇకిలించి నవ్వఁ జేసి
చెంప గంధంబు పూసి, పద్మరా
గంపుఁ బతకంబు వేసి
కెంపు రాకట్లు వెట్టి, మిగుల వలి
పెంపు దుప్పట్లు గప్పి
నెమ్మిఁగురులు మీఁటుచున్, తేఁకువల
నెమ్మిమిఱ్ఱులు దాఁటుచున్
తమ్ములంబులు చేయుచున్, ఒకచేత
నిమ్మపండ్లెగ వేయుచున్.

వ. ఇట్లు సానివాడకు వచ్చి యేమనుచున్నాఁడు.

ఏలలు

'చాళుక్యా భీమానాయాకూ - పోలికనె పుష్పా
మాలికాదూ లొసఁగూచూనూ - ఓ ఒ చెలులారా!
బాలికాలా పొందూ చేసేదా!
నవ్వనీ సాధూజనులూ - రవ్వాని యెంచంగారాదూ
యివ్వాని వస్తూవా లిచ్చూచూ - ఓ ఒ చెలులారా!
యెవ్వనితా పొందూగూడేదా!
గూఢమూనా నాగూణాని - రూఢతా దెలాసి తానె
గాఢమోహామూనాఁబైకొన్నా - ఓ ఒ చెలులారా!
ప్రౌఢులానూ గారావించేదా!
లీలతో నిష్ఠాభాషాణములనే - తేలింపూచూను
వేళఁ దెలసీ వచ్చీనాడానూ - ఓ ఒ చెలులారా!
లోలలా నాదారించెదనూ!

ఆటలా పాటాలా మిక్కిలి - దిటమైనా ఆటదైతే
మాటలాడి పోయేటందూకే - ఓ ఒ చెలులారా!
నూట [illegible] రాఊా లిచ్చెదనూ!
ప్రొద్దు [illegible] గాన కళలా - పద్దూ దెలిసీ కూడేదైతే
ముద్దులాడా గలిగీనాడానూ - ఓ ఒ చెలులారా!
నిద్దురాకూ వెయిమాడా లిత్తూను!
ఇన్నియూనాడంగా నేల? - ఎన్ని కైనా కన్నె కైతే
కన్నెఱికా మంపేటందూకె - ఓ ఒ చెలులారా!
అన్ని వారాలా సొమ్ముూలిచ్చేదా'!

కం. అని యిట్లు వాడవాడలఁ
దన యెమ్మెలు నెఱపఁ, జోడు తల్లికి నపుడే
ధనకాంక్ష వొడమి భీమే
శుని గుడి కేతెంచి వీరచోడమ కనియెన్.

త్రిభంగులు

'చోడకా! సానెవాడకై యొక్క
వేడుకాకాఁడు విచ్చేసెన్
ఎమ్మెలే కావు, సొమ్మెల్లా బెట్టు
ఇమ్ములా నమ్మిక లియ్యఁ బూనెన్
వేవేగ భీమబావకూఁ జెప్పి
నీవు నావెంట నేతేరవే'!

వ. అని యిట్లు పలికిన తల్లికి, నక్కలికి యేమనుచున్నది.

జంపె

భీమనాయకుఁ డింక - నా మనోనాయకుఁడు
సీమనాయకుల నేఁ - గామించ నేరన్
పాలేటి లోపలను - దేలేటి యంచఁ దా
వాలునే? మడుఁగులను - మేలువోనాడీ,
పండువెన్నెలఁ గ్రోలు - చుండు వెన్నెలపులుఁగు
ఉండునే? మతిలేక - నిండుచీఁకటను,
సారమైనట్టి సహ - కారఫలరసమాను
కీర ముమ్మెతకాయఁ - గోరునే చెపుమా?
మొదలి దేవునిపొందు - వదలితే ఆడికకు
మొదలు నీవెఱుఁగవా? - చదువుకొన్నావు!
హితులు నీవును దగిన - పతి యీతఁడని యిచ్చి,
ఇతరులకు నను నియ్య - మతియెట్లు గొలిపెన్?
ధనమేమిటికి? చక్కఁ - దనమేమిటికి? మాన
ధనము గావలెగాక! - జనుల కేయెడనూ

వ. అని మతిన్నేమనుచున్నది.

సీ. 'తన భూషణంబైన దర్వీకరేంద్రుండు
అవనీభరంబెల్ల నానుకొనఁగఁ
దన చూలికామణి తారాధినాథుండు
విబుధులకెల్లను విందుగాఁగఁ
దన తనూభవుఁడు దంతావళవదనుండు
సకలవిద్యల కధీశ్వరుఁడుగాఁగఁ
దన కూర్మిచెలికాఁడు ధనపతియను పేర
నవ నిధానములతోఁ దవిలి కొలువఁ

తే.గీ. దనదు పట్టపురాణి భూధరతనూజ
యెల్ల లోకములను గన్నతల్లి గాఁగ
ఘనత శోభిల్లు భీమశంకరుఁడు నీకు
నల్లుఁడైనాడు చాలదే తల్లికాన'!

వ. అని పతిదైవత లక్షణం బేరుపడఁ బల్కు వీరచోడు నీక్షించి, విటవిటీజన కాంతారఝిల్లి యగు తల్లి యేమనుచున్నది.

తే.గీ. 'అల్లుఁడని యిచ్చగించితి వంతెకాని
తొల్లి యీతఁడు చేసిన దుండగంబు
లెల్లఁజెప్పిన, నీచిత్తమితని మీఁదఁ
బల్లవింపదె! వోవెఱ్ఱిపడుచకాన'!

వ. అని దాశార్థభల్లుండగు నల్లుని దుండగంబులు యేమని చెప్పుచున్నది.

జంపె

'ఓటి కప్పెర తానె - మాటి గుండయగారి
నీట ముంచిన మాయ - నాటకుఁడె యితఁడు!
మేలుగాఁ గంచిపుర - మేలు హుడుగని ముద్దు
బాలుఁ జంపు మహేంద్ర - జాలుఁడే యితఁడు!
దాసి పంద్రెండేండ్లు - నేసి యిచ్చిన కోకఁ
దీసి యిచ్చిన యా వు - దాసియే యితఁడు'!

వ. అని, మఱిన్నేమనుచున్నది.

మటిమ రేకులు

'కట్టఁ బొడల - దుప్పటమ్ము!
పెట్టుకొనఁగ - చిలువ సొమ్ము!
పుట్టుతిరిపె - మరుగు నమ్ము!
తిట్టవలదు - వెనుక మమ్ము!

తురగమెన్న - వెల్లయెద్దు
తిరుగులాడు - నెల్లప్రొద్దు
తరతరాల - నాటివృద్ధ
వరుని వలన - నేమి కద్దు?

పెద్దఱికము - లింతె చాలు!
వద్దు నీకు - పౌరుషాలు
వద్దఁ బాయ - దతని యాలు
బుద్ధిగాదు - సవతి పోరు.

తలపొలంబు - చొరఁగనీదు
వెలఁది యొకతె - లేని వాదుఁ
గలుగఁ జేయు - నెంత సాధు
నెలఁత దాని - కొండుగాదు.

కులము వారి - నెల్లఁ జూడు
కలిమి గలిగి - తిరుగులాడు
చెలువుఁడైన - వానిఁ గూడు
చలము యేలె - వీరచోడు'!

వ. అని తల్లి బోధించితేను, తాను క్రోధించి వీరచోడు యేమనుచున్నది.

తే.గీ. 'ముదియ ముదియంగ మతిదప్పె ముదిసివోక
మనుముఁ బడుపును రెండును మహిని( గలవె?
కొలముఁ గానక కడుపుకక్కు ర్తిగాళ్లఁ
బడయ మతిఁగాదు నావంటి వారికెపుడు'[1]

వ. అని మఱిన్నేమనుచున్నది.

జంపె

'నిటలాక్షుఁ డియలేని - యిటువంటి సొమ్ములొక
విటుఁడిచ్చు ననుటెల్ల - కుటిలంబు కాదా!
ఎఱుఁగవేమో కాని - కరికాళచోడనికిఁ
గురియింపఁడే కనక - వర్షమే వెంటన్!
తెలియవింతే గాక - మలయరాజయగారి
నిలుపఁడే కరుణించి - కలధౌతగిరిని!
నేరమెంచెదు గాక - చేరమను సింహాస
నారూఢఁగాఁ జేయఁ - డారూఢి గాను'

వ. అని తన మనోనాయకుండగు భీమనాయకుని మహత్త్వంబుఁగొనియాడు
చున్న సమయంబున వీరచోడును బోధింప వేశ్యామాతలు వచ్చిరఁట!
యెటువంటివారు.

---

1. 'బొంద మతిఁగొన నావంటివారికెల్ల' - ఈపాదంలో యతిమైత్రి, అన్వయం
తప్పినాయి. అందువల్ల పైవిధంగా సవరించడం జరిగింది.

అటతాళము

కట్టిఁడీలు, ద్రిమ్మరులు - గడుసులు, కలహకత్తెల్, డబ్బుల
పుటికలును, బుడసరులు, చె - నఁటులు, దిట్టకూళల్,
కుటిలచిత్తులు, మాయదారులు, - చిటులకత్తెల్, బుత్తులు,
అటమటంబుల నిలయములు, - నందదుకురాళ్లు,
కొండెగొండులు, పఱచు నిమ్మన - గోళ్లు, వంచుల్
కించులు, అడ్డుబోతులు, ఇల్లమల్లలు, - లంజతల్లుల్.

వ. అట్లువచ్చి, వీరచోడునీక్షించి యేమనుచున్నారు.

ఆ.వె. 'ఏమె వీరచోడు ఈఁప్రొద్దు వొకవింత
వార్తపుట్టె సానివాడలోన
భీమదేవుమీఁది ప్రేమచేఁ దల్లినిఁ
దిట్టుచుంటివనుచు గట్టిగాను'

వ. అని, మఱిన్నేమనుచున్నారు.

కళికలు

'పిన్నబిడ్డలు మిమ్ముఁ - బెంచి యీడేర్చుటలు
కన్నతల్లులఁ దిట్టఁ - గా వలయు ననియె!
దొడ్డగా గణియించు - దురుగాని, మాయిండ్ల
బిడ్డ లేమైనఁ జె - ప్పినఁ గసరుకొనరు
ఇయ్యనోపని జంగ - మయ్య వద్దను జేరి
కయ్యంబునకు బిరుదు - గట్టితివ? మేలు'!

వ. అని పలికి, 'యొకలికి! మన కులాచారధర్మంబున నిన్ను భీమేశ్వరునకుఁ బరిణయంబు చేయునప్పుడు మంగళసూత్రంబు ఇతనికొకటిన్ని, యితరుల కొకటిన్ని గట్టుట యెఱుంగవా? ఎన్నికగా కన్యాత్వం బొప్పగించితివి. గడువు గడచె. విడియాకుఁ గైకొని గణియించర'మ్మనియంటే, ఆ కొమ్మ భీమేశ్వరుని మీఁద తలంపు వుండుటయెఱింగి, మఱిన్నేమనుచున్నారు.

పదములు

పల్లవి॥ 'ఇతనికేల మరులుగొంటివే? చోడకా!
ఇతనికేల మరులుగొంటివే?

అ.పల్లవి॥ ఇతనికేల మరులుగొంటి; వీఁడు మిగుల పెద్దవాఁడు
మత మెఱింగి సొమ్ముపెట్టు మంచికన్నె విటులు గలరు 'ఇతని'

చర॥ గుంటివింటిదంట, తమ్మి - కంటి నమ్ముచేసి మింట
నంటి యున్న బేసిపల్లె - లవియనేసి, ఒకని చేతి
వింటిపెట్టు - కోడినాఁడదే! చోడకా! 'ఇతని'
ఇంటిబిడ్డ చంటిశిశువు - ఈతఁడనుచు నంబిదెచ్చి
కుంటియనలు నడచి వాని - మేఁటి గబ్బిగుబ్బవంటి
చంటిలోనఁ - బలికినాఁడదే! చోడకా! 'ఇతని'
గంతఁ జూచి బెదరు ఎక్కి - రింత మీఁద నెక్కి పోఁగఁ
జెంతనుండ వెఱచు పువ్వు - సంతరించి తుఱిమి చూపు
పొంతనైన - పూఁతఁ బూయునే ! చోడకా! 'ఇతని'
పంతగించరాదు, శీల - మెంత గలిగినాను తానె
వింతరూపమునను వచ్చి - వెఱఁగుపఱచు ఁగాన, భక్తి
కింతమాత్ర - మునను మెచ్చునే! చోడకా! 'ఇతని'

పొంకమునను గట్టుపట్టి - లంకెఁజేయఁ జాల నేయు
వంకమేని వాని పట్ల - ఉంకకాఁడువాఁడు వాని
బింకమింకఁ - జూచినావటే! చోడకా! 'ఇతని'
శంకలేక రాళ్లరువ్వు - సాంఖ్యతొండమయ్యగారి
జంకెనలకు వరము దాఁ గ - ళంకులేక యిచ్చి భీమ
శంకరుండఁ - నాఁగఁ బరఁగెనే! చోడకా! 'ఇతని'

వ. అని దూతిపలుకు వారి పలుకుల కులుకుపుట్టి కులుకుగుబ్బెత కనుఁ గొలఁకుల మొలకకెంపులు మొలపించి తనుఁ దాఁ దెలుపుకొని యేమనుచున్నది.

మటిమరేకులు

'అమ్మలార! అక్కలార! - అందఱికిని యేకదండమూ!
మిమ్ముఁదిట్టఁజాల నేను - మిన్నకా పోవుడింకనూ! 'అమ్మలార'
తలలు నెఱసినపుడె పెద్ద - తనము మీకు నేడ గద్దు!
తెలియరాదు శివుని మాయ - తెలియ మీరు ఎంతవారు? 'అమ్మ'
శివుని అల్లుఁడనుచు నింద - చేసి దక్షుఁ డేమియయ్యె?
భవుని నిందపఱచి పు - రాణభట్టు భంగముగాడె! 'అమ్మ'
ఏను పిన్నదాన మీకు - ఏమి చెప్పినాను కోపమా?
మానఁబూన భీమలింగ - మల్ల వాఁడె తిట్టుకొనుఁడి! 'అమ్మ'
వల్లభుండు ఇతఁడు నాకు - వదలఁజాల నెన్నటికిని
క్షుల్లకంబు లాడరాక - సుగుణులైతె తిరిగిపోవుఁడీ'! 'అమ్మ'

ద్వి. అనవుడు వీరచో - డవ్వతో బంధు
జనులిట్టులనిరి మ - త్సరము రెట్టింప

'అవునె మాయమ్మ! స - దాచారి వగుదు
శివునకుఁజిక్కగాఁ - జీరె గట్టితివి
అందఱు నిట్లు స - దాచారు లైన
పొందగు వారికిఁ - బుణ్యమెక్కడిది?
సానివారలకు నా - చారంబు కులము
మానంబు నీదరు - మానవె గలిగె
నీవేమి చెప్పిన - నిక్కమై తోఁచు
మావంటి వారల - మాటలు వినరు
గడన నీవల యె - క్కడికిని రాక
గుడిలోన నుండు మ్రొ - క్కుదు రెల్లవారు
వారకాంతలు పతి - వ్రతలు గారన్న
వారల తోడుత - వాదంబు లుడుపు
వలపు కారణము నీ - వంటి వారికిని
తలఁప నేమిటికి? మీఁ - దటి సుద్దులెల్ల
ఎప్పటి వలెనంచు, - నెఱుఁగక బుద్ధి
చెప్పితి మిప్పుడె - సిరివచ్చు టెఱుఁగ
మమ్ముల నాడవు - మాడంత మాట
ఎమ్మె యెచ్చిన నాఁడ - దేల మానెదవు?
ఇంత కోర్చిన వారు - ఎవ్వరు గలరు?
సంతోషమాయె ని - చ్చట నుండమింక'
అని పలికి నన్నెచో - డవ్వఁ దోడ్కొనుచు
చనిరి యిండ్లకు బంధు - జనులు వేగమున

వ. ఆట మీదఁట వీరచోడు దృఢంబు గని భీమేశ్వరుం డిచ్చలో మెచ్చి, విటరూపంబు మాని యెప్పటియట్ల వర్తింపుచుండె; మఱియు కొన్ని

దినములకు వీరచోడు మంచిముహూర్తంబున సమర్తాడినవార్త విని పూజారులు చెలువుగా చలువ చప్పరంబుఁ బన్ని, యందునిచి యుచిత కృత్యంబులు నడుపు సమయంబున, మునుపటి కపటంబులుడిగి బంధు జనంబులు, తల్లియు నపరిమితసంతసంబున పరిచర్యలు చేయ వచ్చిరఁట! యెటువలెను.

జంపె

పసుపు నూనెయు వెండి - పైఁడి కోరల నించి
యసమాన లీలమై - నరుదెంచు వారూ,
పండుటాకులు కపుర - బాగాలు చూర్ణంబు
దండిగాఁ దెచ్చి ముం - దర నుంచువారు,
చందనము కస్తూరి - జవ్వాది పన్నీరు
పొందుగాఁ దెచ్చి మైఁ - బూయుమను వారు,
కురువేరు మల్లియలు - గొజ్జంగులును దెచ్చి
విరిశయ్య వేగఁగా - వింపుమను వారు,
పులఖండమును నెయ్యి - పూర్ణంబుగానించి
పులగంబు దెచ్చి మె - ప్పుగ నిచ్చువారూ.

వ. ఇట్లు హితజనంబులు దెచ్చునవి యిష్టలింగంబున కొప్పించి తనవారల కభీష్టంబు లిప్పించఁదలంచి, యొప్పుగా నప్పులగంబు తన మధురా ధరంబునం గీలుకొలిపి జిహ్వాగ్రంబున రుచిఁగొని, ఆ సింహమధ్య యొక్క నెచ్చెలిఁ జూచి మచ్చికతో నేమనుచున్నది.

తే.గీ. 'రావె ఓ చెలి! మీ భీమబావగారు
ఎంత యాశించి యుండునో యిందులకును
'అప్ప పులగంబుఁబంపిన' దనుచునిమ్ము!
ఆసయెఱిఁగినదని కొనియాడుఁగాని'

వ. అని యిట్లు నిశ్చయంబుగాఁ బలికితే, అచ్చెలి యొప్పక
అప్ప కేమనుచున్నది.

నడలు

'ఎక్కినవారికి - ఏనుఁగు కుఱుచను
చక్కటి మాటలు - నిక్కము లాయెన్
దేవర కేఁటికి - దించిన పులగము
కావరమున నియఁ - గావలదమ్మా!
అంటక నిన్నిపు - డరమర చేయఁగ
వంటక మంపిన - కంటకమగును
ఎవ్వరు చేయరు - ఇటువలె! నీ విఁక
నవ్వుచునాడిన - రవ్వలు వచ్చున్'

వ. అని యిట్లు నెచ్చలియాడు మాటలు విని చిఱునవ్వు నగి వీరచోడు
ఏమనుచున్నది.

బౌళిరేకులు

'భావామెఱిఁగి భీమ - బావకు పులగాము
వేవేగనిమ్ము, నీ - వాద మేమిటికె?
అప్పఁ గాదనేవు! క - న్నప్పదెచ్చిన యట్టి
దొప్పనంజుడు తన - కొప్పొనా?
లాగి వేగమున కెం - బావి భోగయ యింట
ఓగిరమునకుఁ జైఁ - జాగింప వచ్చునా?
వియ్యాములూ నవ్వ; - సురియా చవుడరము
మయ్యాచే ముద్దలు భోం - చెయ్యాఁగ వచ్చునా?
దండీగ మేదరి చె - న్నఁడి పొత్తాన పెద్ద
కుండెడంబలి జుఱ్ఱి - యుండంగ వచ్చునా'?

వ. అని చతురోక్తుల సిద్ధప్రసాద మాహాత్మ్యంబుఁ దెలిపి, పొమ్మనుటయు, నమ్మగువ తగవగునని వీరచోడుచే గోరఁగైకొని భోరున భీమేశ్వరు నగరికింజని యతనితలంపు దెలియుటకై తలుపుదండ నిలిచి యేమనుచున్నది.

జంపె

'రావయ్యా! ఓ భీమ - బావయ్యా! నీకూ
బువ్వంపె మాయప్ప - అందుకోవయ్యా!
బలగంబు దెచ్చినా - పులగంబు లోనా
పులఖండమును జున్ను - నెయ్యి కలిసిందీ.
ఆరగింపుచు రుచులు - మీఱఁగాఁ గాఁబోలు
కోర చేతికినిచ్చె - భోరునను ఇపుడు
ఇది నీవు సేవించు - పదిలంబుగాను
ముదిమి లేదిఁక పిల్ల - జుట్టు పై కెదుగున్.
అప్ప చిత్తమువచ్చి - నప్పుడే నీకు
ఒప్పైన వేమైనఁ - దెప్పించి పెట్టున్.
బెట్టు చేయఁగ వద్దు - పిట్టవ్వ చేతఁ
బిట్టు నీకెంతైనఁ - దెచ్చి పెట్టించున్.
కడుపు నిండఁగ నీకుఁ - గుడుకతోఁ బాలు
గొడగూచి చేఁ జాల - నడపింపఁజేసున్.
పరమ నాచికిఁ జెప్పి - తఱచు కుంటెనలూ
తిరుగకుండఁగ నంబి - నరయించున్.
బారిరోఁకట మోదఁ - జేరు నిమ్మవ్వా
గారి కడ్డము వచ్చి - వారించున్.

వెనువెంట నిన్ను ర - మ్మనెడి గుడ్డవ్వా
గని మ్రొక్కి సౌరాష్ట్ర - మున కంపున్.
అలుకఁదీరమి నాటి - కొలఁదెఱింగీ, అల్ల
తిలకవ్వ చే బుద్ధిఁ - దెలిపించున్'

వ. అని మఱిన్నేమను చున్నది.

నడలు

'బుడిబుడి నొడుపుల - నడవడు లడుగక
దుడిదుడి కుడుకకు - నడవేవేగన్
తళతళ తళుకులు - గల చిలుకల కడె
ములఁ జెలువగు కర - ములచేఁ జాఁచున్
అరమర లిరువురి - కరయఁగ దొరకును
కరములు వెరవిక - మరువుగఁజేయున్'

ద్వి. అని యిట్లు నెచ్చెలి - యాడు వాక్యములు
విని భీమలింగంబు - వికవిక నగుచు
వీరచోడవగారి - వీరశైవ ప్ర
చారంబు భువి ప్రకా - శంబు జేయంగఁ
దలఁపుచుఁ దలుపు చెం - తకుఁజేరి హస్త
జలజాతములు వాటి - సందుగాఁ జాపి
కోరఁగైకొని పట్టి - గుజగుజల్మాని
ఆరగించుచుఁ జాల - నాలసించుటయు
మఱఁదలు తలుపుల - మాటుగాఁ జూచి
కరమర్థి తో బావ - గారి కిట్లనియె.

ధ్రువతాళము

పల్లవి॥ 'కోరయియ్యఁ గదవె భీమబావ! కోరయియ్యఁగదవె!
ఆరగించినారు; పూజారు లెత్తఁగెదారు 'కోర'

పద॥ గట్టుకూఁతురు విందు - పెట్టుచుండఁగాను
గుట్టుతోడుత మెసఁగి - రట్టుచేసితివి 'కోర'
ఎవ్వ రెఱుఁగకుండ వైజి - కవ్వగారి యింటఁ జొచ్చి
బువ్వదినుకుంట చాల - రవ్వచేసితివి 'కోర'
కుప్పటగిరము కా - ళప్పగారలు చేఁ
దెప్పి నాఁడనుచు నీ - వొప్పకుండితివి 'కోర'
అప్ప ఆకొన్నది - యెప్పుడిచ్చెదవో
ఇప్పుడిచ్చినను నే - నప్పగించెదను' 'కోర'

వ. అని తనకోర వేఁడుకొన, చకోరనేత్రి సరసంబున కలరి షడ్రసంబు గ్రోలుచూ తన చేతి కోర యివ్వఁజాలక, సగముంచుకొని సంతసంబున దాఁచుకొనియె; నచ్చెలి వెండియు నడుఁగగా, ఆవెండికోరతో నారగించు వాఁడై యుంచుకొని, చోడుమీది వేడుకను భీమేశ్వరుండు తన పూజారులు పూజింపఁ దెచ్చిన బంగారు గిన్నె కంగునఁ బైట వేయుటయుఁ, బొడగని పుచ్చుకొని యచ్చెలువ యేమనుచున్నది.

ఆ.వె. 'బావ మంచివాఁడు బంగారు గిన్నియ
నిచ్చె వెండికోర కెచ్చుగాను
పులగమునకు వస్తువులు సాటిఁ దేలేక
దక్కుచున్నవాఁడు అక్కకిఁ కను'

వ. అని పొగడుచూ నగుమొగంబున మగుడి యేతెంచి అప్పతో యేమను చున్నది.

పాళీరేకులు

'అప్పరో! నీవిపు - డంపిన పులగము
ఒప్పుకొనియె బావ - కోలాలా!
అక్క చవిఁ దొణఁకిన - దనుమాట విని మన
సొక్కటయె బావ - కోలాలా!
తెల్లమిగా నేమి - దెచ్చి యిచ్చినాను
ఒల్లాననఁడు బావ - కోలాలా!
నీ జాడఁ దిరిగిన - నాటనుండి కొత్త
వాజావచ్చె బావ - కోలాలా!
కోరా దెమ్మని యేను - దూఱుకొను చుండగాను
వూరాకుండెను బావ - కోలాలా'!

ద్వి. అనుచు నెచ్చెలి బావ - యంపిన గిన్నె
అనురాగ మొదవంగ - నప్ప గారికిని
ఇచ్చిన బాంధవు - లిచ్చలోఁజాల
నచ్చెరువంది చో - డమ్మ నీక్షించి
'యీనోపఁడనుచు భీ - మేశ్వరు మహిమఁ
గానక నీతోడ - కారు లాడితిమి
ఈరీతి మావాంఢ్ర - కియ్యఁడు; నీవు
వీరశైవాచార - విఖ్యాత మతివిఁ
గావున, నీ పుల - గంబుఁ గైకొనియె
నావిధంబెఱిఁగింప - నంపె నీ గిన్నె'

యనువారు, 'ఈగిన్నె - యతఁడేడ యిచ్చె?
గొనివచ్చె నీచెలి - గుడిలోనఁ జొచ్చి
పూజారు లెఱిఁగినఁ - బోయి యీవేళ
రాజుకుఁ జెప్పిన - రవ్వలు వచ్చు'
ననువారు, 'ఇదితప్ప - దవునె మాయమ్మ!
మనసున తోఁచిన - మాట చెప్పితిమి.
చెనసి చెప్పెఁడు వాఁడు - చెనటైన నీవల
విను వారికైన వి - వేకంబు వలయు
ఎక్కడి భీమేశుఁ! - డెక్కడి పులగ!
మెక్కడి చోడవ్వ! - యెక్కడి గిన్నె!
విన సంగతముగాదు - విచ్చేయుఁ' డింక
ననువారు నైయిండ్ల - కరిగి రందఱును

వ. అనియిట్లు చోడు బంధునివహంబులుం జనిన, నిచ్చట భీమేశ్వరుండు పులగంబారగించి కోరఁ దొలగించి యున్న సమయంబునఁ , బూజారులు పూజింపవచ్చి శృంగారమగు బంగారుగిన్నియ వెదకి కానక వెఱఁగంది మలోఁ దాము వాదించిరఁట యెటువలెను.

జంపె

'తలుపుఁ దియ్యఁగను ముం - దఱఁ జొచ్చె బాలాజి
తెలియుఁడా' యని కన్ను - గిలిపె నొక్కరుఁడు.
'మనసుమెత్తని వాఁడు - మారజియ్యయె పుచ్చుకొనెఁ
గాని, యతఁ డుంచుకొనఁ' - డనియె నొకఁడు.
'కుడుక యీతఁడె పుచ్చు - కొనె' నంచు 'తమ్మళ్ల
కొడుక! యిటు విలువు' మని - కొంగొడిసె నొకఁడు.

'వాని కేఁటికి? నిన్న - వరుస యీ వీరాజి,
వాని నడుగు' మటంచు - గమకించె నొకఁడు
'ఈరాతి రన్నాజి - గారి, భీముని చేతఁ
గోర చూచితి' నంచు - గుఱిచెప్పె నొకఁడు.
'తలుపు చేరువకు నిం - తకు మునుపు చోడవ్వ
చెలికత్తె వచ్చె' నని - తెలిపె నొక్కరుఁడు.
'తాళంబుఁ దియ్యకే - తరిగిన్నె లాగించు
టేలాగొ యీదేవుఁ - డెఱుఁగు'నని నొకఁడు
'ఈదేవుఁ డెఱుఁగనీ - యెఱుఁగకుండఁగనీ, త
పోధనులు పట్టి'రని - పూనె నొక్కరుఁడు.

వ. ఇట్లు తపోధను లొకరి నొకరు నమ్మించుకొని, 'చోడు చెఱఁగుమాసి యున్నది; యీడకు చెలినంపఁ గారణంబేమి? బంగారుగిన్నియ దొంగిలింపనంపుటకు నిశ్చయంబగు, రండురం'డని యొండొరులఁ బిలుచుచు వచ్చి, చోడకంజూచి యోడక యేమనుచున్నారు.

ఆ.వె. 'అవునె! మంచిదానవహహా! యో చోడక!
చెఱఁగుమాసి కడలఁజేరి యుండి
దొంగిలించినావు బంగారుగిన్నియ
చెలుల చేత, నీకు చెల్లునఁటవె?

జంపె

భీమలింగము మీఁద - ప్రేమ యింతకు వచ్చె
తే మానమున గిన్నెఁ - దెప్పించవమ్మ!
వారకాంతల యింట - వచ్చి పుట్టినయపుడె
వీరచోడమ! నీకు - మేర యెక్కడిది?

'వెడలి పొమ్మ'నిన 'నే - విడువఁజాల' నటంచు
గుడినుండి గుడిఱాళ్లు - గోయఁజొచ్చితివి
పూజారులము మేము - పుచ్చుకొన్ననుగాక
ఓజయొ! నీకు దే - వునిసొమ్ము ముట్టన్
హరుని పువ్వులు ముట్టఁ - దరణి హస్తముఁ ద్రుంచు
నరసింగనయనారు - చరితంబు వినవా?
కొట్టారమున శివుని - కొలుచుఁ గైకొను భార్య
పొట్టఁ జించడె! చోడ - భూపాలుఁ డెఱిఁగి
అడిభర్త శివునకై - విడుచు మచ్ఛము వున్న
మడుఁగుఁ జేరఁగఁబోక - మరలి తా రాఁడె!
గురుతుగా తాఁగట్టు - గుడిఁ గూల్చెనని గంధ
కరిఁ జంపె చెలఁది భీ - కరవృత్తిఁ దొల్లి
అన్నియును నీవెఱిఁగి - అజ్ఞానమున శివుని
గిన్నెఁ దెప్పించితివి - మన్నింపఁ దగునా'?

మటిమ రేకులు

'అన్నలార! నన్ను నేర - మెన్న నేల? మంచివెండి
గిన్నెఁ బుచ్చుకొన్నవాఁడు - మున్నె భీమలింగమూ 'అన్న'
గిన్నెఁ దెచ్చి గిన్నెయడుగు - కొన్న మేలుగాక, దొంగ!
వన్నెవెరసి యిచ్చినపుడె - విన్నవారు మెత్తురా! 'అన్న'
దొంగతనము సానెవారి - వంగడమున లేదు! భీమ
లింగమునకుఁ గద్దు నేను - కొంగునించి తెలిపెదా 'అన్న'
మునుపు సానెవారి మాన - ధనముఁ బుచ్చుకొన్న ముచ్చు
ధనము వాయ వారి వార - మనుచు ముచ్చుఁజేసెనూ 'అన్న'
మొదలిదొంగ తానె మూల - నొదిగియుండి మీకునిట్టు
పదరుఁ జెప్పి పంపినపుడె - వదలిపోవ నిత్తునా! 'అన్న'

పెట్టుపోఁత దలఁప కేను - గుట్టుతోడ నుండఁగాను
వట్టి దొంగతనము మోపి - రట్టుఁ జేయ నేర్చెనా! 'అన్న'
జడల నొడల నుండి సగము - బడలఁ జేయు వారిమాట
గడువ వెఱచు వారి వలెనె - నడుగ కున్న నేరమా'! 'అన్న'

ద్వి. అనుచు బీరములాడు - నవ్వీరచోడు
ఘన మెఱుంగక జియ్యా - గారలిట్లనిరి;
'దేవర గిన్నియఁ - దెచ్చి దాఁపించి
కావరమున సత్తు - గలదాని వలెనె
ప్రతివల్కి పార్వతీ - పతినాడు నోట
నితరుల ననఁగ నీ - కెంత మాత్రంబు?
ఈ వెండి గిన్నియ - నిచ్చినమాట
దేవుని నిదెనీవు - దెలుప నోపినను
నిజభక్తురాలవు - నీలకంఠునకు
గజచర్మధరుఁ దెల్ప - గా నోపుదేని
గట్టుకూఁతురు తోను - గంగతో నిన్ను
గట్టిగా సమమని - కాఁజూతు మమ్మ!
కాకున్న పరిహాస - కమును పొందెదవు
నీ కులంబునకెల్ల - హీనత్వ మొదవు'
ననవుఁడు వీరచో - డవ్వ పూజరులఁ
గనుఁగొని సమ్మతి - గానిట్టు లనియె.

కం. 'రప్పింతును సభలోనికిఁ
దెప్పింతును వెండిగిన్నె దేవునిచేతన్
మెప్పింతు సాధుజనులను
ఇప్పింతును మీకు వరములెన్నిక మీఱన్'

వ. అనుటయుఁ బూజరులు వెరఁగంది, 'యమ్మహాప్రసాదంబట్లకాని'మ్మని, పురజనంబులు నెఱుఁగఁ జాటించి, ఆమె సామర్థ్యంబు చూచుటకై భీమేశ్వరుం బూజించి, తలుపు తాళంబులు గీలించి, ముఖమంటపంబున నఖిల నియోగంబులఁ గూర్చియున్న సమయంబున, వీరచోడు శుచి స్నానంబుచేసి మనోవీథి భీమేశ్వరు దీక్షించి నియమించి, అచలిత ధైర్యంబున నలంకరించుకొని, హితజనంబులు చుట్టూరాఁగా శతపత్ర కర్ణికయుఁబోలి చనుదేఱఁగాఁ, గనుఁగొని పురజనంబులు వితర్కించిరట! యెటువలెను.

జంపె

'తానేడ? పార్వతీ - ధవుఁడేడ? పలికింపఁ
గానేర'దని పూని - కతమిచ్చు వారూ
'ఎంత నమ్మినదొ! భీ - మేశునకుఁ గాకున్నఁ
బంతమాడద'టంచుఁ - బలికేటి వారూ
'తలుపుఁ దీయించెనా! - తానప్పుడే శివునిఁ
బలికించు కొనె'నంచుఁ - భాషించు వారూ
'శివవెఱ్ఱి గాక యే - సీమలో వెలయాలిఁ
దవిలి గిన్నియ యిచ్చె - భవుఁ'డనెడు వారూ
'శంభుండు భక్తవ - త్సలుఁడాయెనా యిప్పు
డంభోజ ముఖి కిచ్చు' - నని యేటి వారూ

వ. ఇట్లు పురజనంబులు వితర్కింపఁగా, వీరచోడు సభలోని కేతెంచి భీమేశ్వరున కభిముఖంబై కరకమలంబులు మొగిచి, యేమని వినుతింపుచున్నది.

శా. 'ఓ భీమేశ్వర! ఓ భుజంగవలయా! ఓ పార్వతీవల్లభా!
ఓ భక్తప్రియ! ఓ నగేంద్రనిలయా! ఓ జహ్నుకన్యాధవా!
ఓ భవ్యాత్మక! ఓ దివౌకవినుతా! ఓ లోకసంరక్షకా!
నాభావంబున నిన్ను నమ్మితిఁ జుమీ! నాకోర్కె లీడేర్చుమీ'!

వ. అని వినుతించి, యతనిఁ బలికించఁదలంచు తలంపున తలుపుడాయ వచ్చి తలుపుదండ నిలిచి యేమనుచున్నది.

అనుపులు

'వెలఁది సిబ్బెపుగుబ్బనీవని - కొలిచి నంబీ పిలిచినఁ
బలుకుకైవడి నిపుడు నాతోఁ - బలుకవయ్యా!
కొలువులో బావూరిబ్రహ్మయ - పిలుచునపుడూ హో!యని
పలుకుకైవడి నిపుడు నాతోఁ - బలుకవయ్యా!
చెలఁగి దేడరదాసిదేవయ - సీమలోనా బేర్కొని
పలుకుకైవడి నిపుడునాతోఁ - బలుకవయ్యా'!

వ. అని కొనియాడు నవ్వీరచోడు మీఁది మోహపారవశ్యంబున భీమేశ్వరుం డేమియుబలుకకుండిన, నప్పుడప్పురజనంబులు 'వీరచోడు చోరయగు'నని నిందింప, నందఱుఁ జూచి వారింపనోపక సభికులూరకుండి; రంత రోష స్వాంతయై వీరచోడు శేషభూషణుండగు నద్దేవదేవు నేమని దూఱుచున్నది.

ఏకతాళము

'పలుకకుంటే నేమి? మిక్కిలి - భాగ్యమాయె నందుకేమి?
పులగముగిన్నియ తలు - పులబైట నిడవయ్యా?
కొట్టఁగనేరము వింటి - కొలఁది నర్జునుని వలెఁ
దిట్టఁగ నేరము నిన్నుఁ - దివిరి యంబెన వలెనే

శిలలరువ్వంగ లేము - చేరి సాంఖ్యతొండయ యట్ల
చెలఁగి దాడి రానోపానేరము - చేరమరాయని రీతి
కొట్టకతిట్టక రాలరు - వ్వక దాడివెట్టక
గుట్టుతోఁ బలుకుమన్నఁ - గూడదు నీకుఁ బలుక
నన్ను ముచ్చుగఁ జేయ నీకూ - నాయముగా దీవేళ
ఉన్నరూపముఁ దెలుప - కున్న జీవము నీసొమ్ము¹!

వ. అని దూఱు వీరచోడు వీరావేశంబు వీక్షించి సకలజీవదయాపరుండగు భీమేశ్వరుండు సాక్షాత్కరించెనఁట! అద్దేవుండెటువంటివాఁడు.

అనువులు

రూఢిమీఱ మహాగణంబులు - గూడి చూడా నాట్యమూ
లాడువాఁడు, బుధోత్తములు గొని - యాడువాఁడూ!
దిట్టయగు పులిరక్కసునిపైఁ - దివియ దట్టీగట్టిగా!
గట్టువాఁడు, ప్రసిద్ధమగు తెలి - గట్టు వాఁడూ!
ఒప్పుగాఁగ గజాసురేంద్రుని - నొలిచి తెచ్చూ దుప్పటీ
గప్పువాఁ,డెన్నంగఁదగు మెడ - కప్పు వాఁడూ!
పట్టిఁగూడిన యడ్డతల బా - పని శిరంబూ గుఱిగాఁ
బట్టు వాఁ,డనువైన వలపుల - బొట్టువాఁడూ!
గొట్టుచేయు పురంబు లొక్కటఁ - గూడనాటూ శస్త్రమూ
పట్టువాఁడు, మహాత్ములను చే - పట్టు వాఁడూ!
సిరివరాంబుజభవ సురేంద్రులు - చేరి కొలువా పన్నగా
ధరుఁడు, భీమేశ్వరుఁడుఁ దాఁ బ్ర - త్యక్షమయ్యెన్.

వ. అప్పుడెటువలెను.

పాళీరేకులు

కురిసెఁ బువ్వుల వానలూ - ఇంపుగ
మొరసె దేవదుందుభులూ
పాడిరి కిన్నరసతులూ - జతఁగూడి
యాడిరి అప్సరలూ
మెచ్చిరి ప్రమథవరులూ - దీవన
లిచ్చిరి సంయమివరులూ.

వ. ఇట్లు ప్రత్యక్షంబగుటయు, చోడు సత్యంబునకు సమస్తమైనవారున్ను వెఱఁగంది, యభయంబులు వేఁడుసమయంబున, నఖిల లోకాధీశ్వరుం డగు భీమేశ్వరునకు నవ్వీరచోడు పరమహర్షంబున దండప్రణామంబు లాచరించి, హస్త పంకజంబులు మొగిచి ప్రస్తుతించెనఁట! యెటువలెను.

ఏకతాళము

'పరిచయజూట సుధాకరా! అఘ
పరిహర! రతిధవభీకరా!
సురుచిర నవ్యగుణాకరా! ముని
వరమానసాబ్జ దివాకరా! భీమేశా! జయ! జయా!
జయజయ విహరణ! వారణ నుత!
భయదూరా! నగధర! బాణవత్సల!
నయనత్రితయ! జితనాగపూజిత!
హయవాహమిత్ర! సమగ్ర పుణ్యచరిత్రా! జయ! జయా!
భుజగకులాధిప భూషణా! దక్ష
యజన యాజక మదశోషణా! కరి
యజినవసన! లోకపోషణా! జయ! జయా!

వ. అని మఱిన్నేమని కొనియాడుచున్నది.

ప్రాసరేకులు

'దేవా! నుతబల - దేవా! సుస్థిర
భావా! మహిత ప్ర - భావా! జయ! జయా!
రుద్రా!కరుణ స - ముద్రా! సేవిత
భద్రా! ధీశత - రుద్రా! జయ! జయా!
అంగా! నిగమతు - రంగా! హస్తకు
రంగా! శరనిధి ని - షంగా! జయ! జయా!

అనువులు

శుభగుణోద్ధరణాయ కలుష ని - షూదనాయ
ఇభమదాపహరాయ శ్రీ భీ - మేశ్వరాయ 'జయ! జయా!'
నందనందన వందితాయ గ - ణ ప్రియాయ
ఇందుకోటీశాయ శ్రీ భీ - మేశ్వరాయ 'జయ! జయా!'
రామ వామాంగాయ పంచ శ - ర ద్విషాయ
హేమనగచాపాయ శ్రీ భీ - మేశ్వరాయ' 'జయ! జయా!'

ద్వి. అనియని కొనియాడు - నవ్వీరచోడుఁ
గొనుగొని భీమశం - కరుఁడిట్టులనియె
'జలజాతగంధి! నీ - సద్భక్తిఁ జూచి
పులగంబు నేభుజిం - పుట నిక్కువంబు!
భక్తవత్సలుఁడనై - పరఁగెదు నాకు
శక్తియు, కలిమి, వం - శంబు కారణమె?
పరికింప నేఁటికి - బాహ్యావర్తనము
లరయంగనేల హీ - నాధికత్వములు.

కన్నప్ప మాకు నే - కతమున హితుఁడు?
చెన్నప్ప యే రీతి - చెలికాఁడు మాకు?
నంబెణ్ణగారు ఏ - నాటి చుట్టంబు?
అంబెణ్ణగారు వి - య్యంబౌట యెట్లు?
బాణుండు మాకునే - పగిది బంధుండు?
ఏణాయతాక్షి! నీ - వెఱుఁగవె మున్ను?
భక్తిసమేతులై - పరఁగుటఁజేసి
భక్తులు మాప్రాణ - బంధువులైరి.
అటుగాన నీవు మ - హాభక్తు రాల;
విట నీచరిత్రంబు - లెల్లను జూచి
మెచ్చితి నోహోహా! - మేలు! మేలింక
నిచ్చెద నీకోర్కె - లేమైన నడుగు'
మనుటయు వీరచో - డవ్వ కారుణ్య
వనధియౌ పార్వతీ - శ్వరుని వీక్షించి
'అభవ! నీ వాది లో - కాధీశ్వరుఁడవు!
అభిమతార్థప్రదా - యకుఁడవు! మిమ్ముఁ
బొడఁగంటి, సకలంబు - పొడఁగంటి, యొక్క
టడుగంగ నేమిటి - కట్లన రాదు;
మెచ్చివేఁడు మటన్న - మేలయ్యె నిపుడు
ఇచ్చోటఁ గూడిన - యీ పౌరజనము
లందఱుఁగొలువ న - త్యర్థిఁ గైలాస
కందరమున నుండఁ - గా వేడ్కగలదు.
బలముతోడఁ గుమార - పాలఘూర్జరుని
ఎలమితోఁ దోడ్కొని - యేగిన భంగి
తోఁకొని పొ'మ్మన్న - ధూర్జటి యప్పు
డాకాంక్ష వీరచో - డవ్వను బౌర

జనులను దోఁకొంచు - సంభ్రమలీల
ననిమిషుల్ గొలువ తా - రాద్రికి నడిఁగె

వ. అప్పుడమ్మహాదేవుని నిజావాసంబగు కైలాస (కందరంబున) భక్త జనంబులెదుర్కొని వీరచోడు నీక్షించి;రటమీఁద నెటువలెను.

అర్ధచంద్రికలు

అమ్మవ్వ 'యౌనెమా - యమ్మ!' యని మెచ్చెన్
నిమ్మవ్వ 'కల్పకము - కొమ్మ!'యని పొగడెన్
పిట్టవ్వ 'గురుభక్తి - నిట్ట !' యని చూచె
కదిరవ్వ 'శీలంబు - కుదుర!' నుచు నెంచ
తిలకవ్వ 'శైవకుల - తిలక!' యని పొగడెన

వ. ఇట్లు సకలజనంబులు గొనియాడఁ, జెలఁగు హేమసౌధంబుల భీమ శంకరు కటాక్షంబునన్ గౌరీ సమీపవర్తియై యగణిత వైభవంబుల శోభిల్లుచునుండె; నఁటమీఁద నెటువలెను.

కం. 'చాతుర్యంబగు నీకథ
గీతార్థములందు మిగులఁ గీర్తన కెక్కన్
ఆ తెఱఁగెల్లను నేను పు
రాతన నివహంబుకరుణ రచియిస్తిఁ జామీ!'

ద్విపద

అని పార్వతీ మనో - హరునిపేర
జనలోక సంస్తూయ - చరితుని పేర

కమలాప్త కోటి ప్ర - కాశుని పేర
సముదీర్ఘ వైభవా - శ్రయదేహు పేర
చిరతరస్థితి రొంపి - చెరుల నత్యర్థి
నిరవుఁ గైకొను శంక - రేశ్వరు పేర
వరగుణోదయుఁడు రే - వణ సిద్ధదేవ
గురుసేవకుఁడు శైవ - కుల పవిత్రుండు
అసమ శీలుఁడు గ(ణ) - పయ కూర్మి సుతుఁడు
రసికశేఖరుఁడు గు - జ్జము కపోతయ్య
అవిరళ భక్తిఁ జో - డవ్వ చరిత్ర
కవిజనంబులు మెచ్చఁ - గా రచియించె.
ఈ చమత్కృతి శంక - రేశ్వరు కరుణ
నాచంద్ర తారార్క - మై యుండుఁ గాత!
ఇది విన్న వ్రాసిన - యీప్సితార్థములు
సదమల మతులకు - సమకూర్చు శివుఁడు.

*****